శ్రీరస్తు-

శ్రీసీతారామతారకబ్రహ్మణేనమః

శుభమస్తు- అవిఘ్నమస్తు- శ్రీశారదాంబాయైనమః

శ్రీమదఖండసచ్చిదానందపరబ్రహ్మణేనమః

# హంసస్వరకైవల్యచింతామణి

అనునీగ్రంథము 



సృష్ట్యాదిని సర్వాంతర్యామియగు

శ్రీశంభుదేవుండు శ్రీపార్వతీదేవికినుపదేశించినది-

దీనిని

అగస్త్యాదిమహాన్యులు సంస్కృతాంధ్రద్రావిడభాష
లయందు రచియించియుండు వాటిని విచారించిచూడ
గానందులో నిటీవలజనులచేదించుటకు అనుభవముచా
లమిచేసరస్వరవ్యాఖ్యాస్తమైనసంగతులు సరిపడియుండనం
దున ఏగ్రంథములన్నియు చక్కగాపరిశీలించిఆంధ్ర
దేశీయులగుసాధువులు-భక్తులు యోగులు. ముముక్షువు
లుమొదలగువారలందఱకును అత్యంతావశ్యకమైయుం
డునట్టుల ఆత్మారాముండగుశ్రీ సీతారామస్వాములవారి
యుభయపదకమలమకరందపానమత్తమధుకరాయమాన
మానసుండును- ముముక్షుజనవిధేయుండును-మద్రాసు
౨౮వ - రిజిమెంటు నేటివ్ ఫాంట్రియొక్క-సూ-
ల్దారునగు

శేకూరి - రామస్వామినాయనిచే

మిక్కిలిసులభశైలితోగద్యగానుంగునరచియింపంబడి

చెన్నపట్టణం టంకసాలవీధి 3౧౫ గృహములో

చిత్తూరులోకనాథమొదలారివారి

ఉమామహేశ్వరముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపంబడియె

౧౮౮౫ సం॥

శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమః.

శ్రీసీతారామతారకపరబ్రహ్మణేనమః.

# హంసస్వరకైవల్యచింతామణి.

శ్రీనాధుసత్పదచింతనంబొనరించివాణిజానకినిక్తై వారమొసగి।
గౌరీమనోహరుకరుణనుగొనియాడికరిరాజవక్త్రుగజ్ఞాతనూజు।
పదములకెఱగిసత్పావనులగుసనకాదినారదులప్రహ్లాదుబొగడి।
మార్కండసూరిసమైత్రావరుణిధ్రువసాత్యవతేయులసత్కరించి।

ఉపాసనా మూర్తియగు.

స్వయంప్రకాశప్రణవస్వరూపుండగు శ్రీసద్గణేశ స్తుతి.

సీ॥ శ్రీసిద్ధివిఘ్నేశశ్రితజనభవనాశ ధృతరదాంకుశపాశదీప్రకాశ। పా
ర్వతీభవముఖపద్మపంకజసఖ భద్రసామజముఖపాపవిముఖ। భర్మస
న్నిభగాత్రభక్తవినుతపాత్ర ఫణివలయితసూత్రఫాలనేత్ర। పాకశా
సనముఖ్య పరమసంయమిసఖ్యయేకదంతనిముఖ్యలోకసౌఖ్య। విఘ్నరా
జవినాయకవిశ్వరూప। ముక్తజనమానసాలయ మోక్షదీప। సచ్చిదా
నందజగదీశస్వప్రకాశ। సర్వవిఘ్నవినాశశ్రీసద్గణేశ॥

సకలజీవభవసాగరోత్తారకంబగు శ్రీరామ తారక స్తుతి.

క॥ శ్రీరామరామయనుచును। యీరేడుజగంబులందుయేనరుడై
నన్। ఆరామచంద్రు దలచిన। కారాతులుగావెవాని కర్మ
ములదలపన్॥ * * * * * * * *

పరమగురుధ్యానము.-

శ్రీమహాలక్ష్మిపుట్టినసీమయనగ। దనరునామేల్మణూరినే తనువు
నకిక। పట్టుగాజేసినివసించు భాగవతము। రామయాంఘ్రులవిను
తింతుప్రేమమలర॥ * * * * * * * *

ఆంజనేయభుశుండుల కంజవిభుచు.
హంసస్వరతత్త్వకైవల్యమాంత్రమునను
చెప్పబూనితినందఱునొప్పుగాను।
నాదువాక్కున నిల్చినన్నాదుకొనుడీ॥

పార్వత్యువాచ.

శంభుశంకరమహాదేవసర్వసాక్షి।
పశుపతేనీకుమ్రొక్కెదభక్తవరద।
సర్వలోకములకునాకుసార్ధకంబు।
నైనస్వరతత్త్వకైవల్యమానతీవె॥

ఈశ్వరఉవాచ.

గిరిరాజతనయనీదగు । వరప్రశ్నమువలనశుభమువరలుజనులకా।
స్వరకైవల్యముదెలిపెద। గురుబాలురుగనిసుఖింపకుంజరగమనా॥
దీనిశ్రద్ధతోడదినమునభ్యాసింప । చాలమేలుగలిగికాలనియతి । దా
టిబ్రతికిబ్రహ్మతత్త్వంబుతానయై । ముక్తిబొందునట్టిశక్తినొసగు॥

శ్రీఉమాదేవి శ్రీశంకరమహాదేవునకు నతిప్రీతిపూర్వకమున దండ
ముబెట్టి హేచంద్రశేఖరా - ఈ ఒకస్వరమేహంసయనియు-గాలియని
యు మనస్సనియు జీవుడనియు శ్వాసమనియు ఊపిరియనియు - ప్రా
ణమనియు - స్వరమనియు ననేకపేళ్లచే వ్యవహరింపబడుచున్నది-అని
యానతిచ్చిరిగాన శాస్త్రము - సూర్య - చంద్ర - గ్రహ - తార-కర
ణ - యోగ - వార - పక్ష - మాసము తుదగాజెప్పంబడిన జ్యోతిష
లక్షణమును గుర్తెఱుగనివారలు తమతమ మనస్సంకల్పముచేత శుభా
శుభంబులం దెలుసుకొను మార్గముకలదని నాయందలి కృపారసము
లుకునట్లు వాక్రుచ్చుమని యతిప్రీతిపూర్వకమున మనవిచేసుకొనగా
శ్రీచంద్రమౌళిచెప్పుచున్నాడు - సొగసగు కంకణమును ధరించినహస్త
ములుగల హేకాత్యాయనీ అతిరహస్యమును - మిక్కిలి శ్రేయస్కర
మును - మోక్షప్రదమును - ముముక్షుజనాపేక్షితంబునున్నగు హంస
[illegible]చింతామణియను నొకశాస్త్రము నాహృదయకుహరమందు గూ

ధ్యమైయున్నయది - దానిని నీయందలి ప్రీతిచే తెలియజెప్పెద - నీవు మిక్కిలి గారవంబున నభ్యసించిజూడుమా అట్లు చూచినట్టాయెనా నీకు మిక్కిలి మేలుగలుగును - అనిమణియుం జెప్పుచున్నారు-

ఎ టు ల న గా.

చెప్పబడ్డ నాలుగుపురులుగూడిన గొప్పత్రాటివలె పారంపర్యముగా వృద్ధియగుచువచ్చెడు బ్రహ్మ - క్షత్ర - వైశ్య - శూద్రాది వర్ణాశ్రమంబులం బొంది యున్న యీమనుష్యదేహమందు ఈ స్వరము జీవుల యొక్క నాసికా ద్వారములందు నిలచి యెద్దుకు ముక్కుత్రాడువేసి త్రిప్పునటుల పుణ్య పాపములను విషము ననుభవింప జేయుచున్నది. అట్టివిషమును తినుపించగాతిని దారుణంబైన కాలుండను సర్పమైనది మింగుటకును కక్కుటకును తాములోబడి పుణ్యపాప ములను ద్వంద్వములకు వశులై పుట్టుచు గిట్టుచునుందురు - అయితే నీకు నేనుజెప్పబూనిన యీహంసస్వరశాస్త్రమును ఉపేక్షింపక ఆచార్యులమూలముగా విచారించి తెలుసుకొని యనుభవించుచూ యామార్గమందే నిలచిన వారలు ఎవరైనాసరే ఒక్కపెట్టున అమరత్వమునుం బొందుదురు. ఆరీతిని విచారించి తెలుసుకొననివారలు మూగలైనయచేత నప్రాయులై సదాజనన మరణాది దుఃఖములను బొందు చుందురని గ్రహింపుమా * * * * * * * * * *

స్వరమును చూచుటకు ఆసనవిధుల తెలియ జెప్పుచున్నారు.

ఎ టు ల న గా.

వెదురుతడికెను ఆసనముగా వేసుకొనినదరిద్రము - రాతిమీదనైతే వ్యాధి - ఉత్తభూమియందైతే దుఃఖము - మ్రానిపలక అయితేచెడుగు - తుంగమొదలగు గడ్డితో చేసిన చాపలయితే యశో నాశము- పచ్చనాకు ఆసనమైతే మనోభయము - కృష్ణాజినమైతే జ్ఞానము - వ్యాఘ్రాజినమైతే యోగసామ్రాజ్యము - దర్భాసనమైతే మోక్షప్రదము శుభ్రపటంబు అనగా తెల్లని వస్త్రమైతే శుభంబు - చిత్రాసనమనగా రత్నకంబళమైతే శుచి - వీటియందుయు క్తమైనదద్దో అట్టి ఆసనమందుం

## హంసస్వరకైవల్యచింతామణి.

ఈస్వరమును చూడవలయును - తక్కినవి శేషములను తెలియజెప్పెద సావధానముగా వినుము - నెమలివంటి సొగసుగల హేపార్వతీ. ఈ యాసనములయందు గృహస్థాశ్రములై సగుణభక్తిసలుపు వారలకు శుభ్రపటము రత్నకంబళములు యోగ్యములు కర్మనిష్ఠ - వైరాగ్య-యోగ - జ్ఞానసాధనము చేయువారలకు వరుసనువ్యాఘ్ర - కృష్ణాజిన దర్భాసనములుయోగ్యములైయుండునని పెద్దలందురు. * 3

### స్వరముచూచేవిధమును తెలియజెప్పుచున్నాను.

ఎట్టులనగా,

మీఁదవివరించబడియుండు ఆసనము లనేకవిధములుండును - వానియందు సత్సంబంధమైన యొక ఆసనమందు పద్మాసనమనబద్ధ అంగముతోనుండి చూచేటప్పుడు మనస్సునకు సంకల్పముచేత మిక్కిలి లంపటకలుగును - అట్టి కోరికగేడపాధులను - తనయిష్ట దేవతాయుపాస్తి బలిమిచేతనున్న - సత్సంగము శాస్త్రచింత నాదులచే నివర్తింపచేసుకొని - నిర్వికల్పండై చిత్తమును స్థిరపఱచి - ఉడ్యాణబంధము కడుపుకిమచేత నాభిబంధించుట - ఉడ్యాణబంధమనబడును - దీనిన భ్యసించువారలకు ఆధివ్యాధులు - కాలపాశమునుతేపట సిద్ధాంతము- ఇట్టిప్రాణోపాయముసుజేసి పిదపస్వరమునుతలంచితే అపారమైన భగవత్కృపకు ఆస్పదుడగు వాడగ్రీందనుండెడు ప్రణవాకారము మొదలుజేసుకొని డెబ్బదిరెండువేల నాడులున్న యీదేహమందు కలిగియున్నవిధములుకనబడును-ఆ డెబ్బది రెండువేలనాడులయందుదశనాడులు ముఖ్యములు - అందింటిలో మూడునాడులతిముఖ్యములు - ఆమూటి ద్వారాస్వరమును సులభముగాతెలుసుకొనవలయును - వీటిని తెలుసుకొంటే వుత్కృష్టమైనశుభ ములిచ్చును- గాన ఆయాక్షరమును చూడుము - హరిణమువంటి సొగసుగు నేత్రములుగల హేపార్వతీ- ఇంక ముందీవివరములను బట్టిముందువాక్యముల సందర్భముచూచుకొనుంగొనవలయును-

* *

## ప్రాణాయామవివరము-

యమ- నియమ- ఆసన - ప్రాణాయామ-ప్రత్యాహార- ధ్యాన- ధారణ - సమాధులను వీటినే అష్టాంగయోగములని శాస్త్రములు చెప్పుచుండును- యమమనగా- స్వర్ణస్తేయ- సురాపాన- పరదారగమన- అనృత్య. జీవహత్యాదిపాతకముల వర్జించి ఇంద్రియములనణచియుండుట- నియమ మనగా- తత్వశాస్త్రశోధన- తపస్సు- పరిశుద్ధి-దేవభక్తి- మనస్తుష్టి మొదలగువానినికలిగియుండుట - ఆసనమనగా చతురుత్తరాశీత్యాసనంబులలో పద్మాసన - సుఖాసన - ఉడ్యాణబంధ- జాలంధరబంధ- మూలబంధాది ముఖ్యాజ్ఞములతోనుండి ధ్యానయోగము సాధించుట - ప్రాణాయామ మనగా ప్రాణవాయువును- రేచక- పూరక - కుంభకములుచేయుట - ఇందు రేచకమనగా ప్రాణవాయువును పంద్రెండంగుళములు వెలుపలవిడుచుట- పూరకమనగా ప్రాణవాయువును లోగొనుట - ప్రాణవాయువునుసాధారణముగా పూరించునప్పుడు రేచకములో నాల్గంగుళములులయించి యెనిమిదంగుళములే పూరకమగును - గాన తెలివిమంతులు లయమైన నాల్గంగుళములు చేర్చి యథారీతిని పంద్రెండంగుళములుగా పూరించుకొందురు-లయించుట ఆయుక్షీణమనియునులయముకాక పంద్రెండంగుళములున్న పూరించుట ఆయుర్వృద్ధియనియును- శాస్త్రములున్న సాధువులయనుభవమున్న ప్రత్యక్షమైయుంటున్నదిగదా ఈ౧౨ అంగుళములయుంకెనుబట్టే అజపామంత్రం రోజుకు ౨౧౬౦౦ - అనిసాధువులు చెప్పియున్నారుగాన జాగరూకతగలిగితే మనమేస్వతహా చూచుకొనవచ్చును- కుంభకమనగా ప్రాణవాయువు నరికట్టుట అనగాకుంభించుట-ప్రత్యాహారమనగా ద్వివిధ ఉపాధులను వర్జించి అంతర్దృష్టినుండుట- ధ్యానమనగా ఇంద్రియదశకమునణచి బ్రహ్మయోగము చేయుట ధా

రణయనగా బ్రంహరంధ్రము- భ్రూమధ్యము నాసిక- కంఠము - హృదయము- నాభి వీటనొకటియందు మనస్సు మారుతెముల చెదరక దృష్టి నుంచియుండుట- సమాధియనగా- ఇంద్రియములగుతత్వ చేష్టలకు హేతువైన యీ దేహమందుండి వాటితో కూడియునిస్సంగత్వమును పొంది యున్న ఆత్మయగుతన్ను దాజూచుట- ఉద్యాణబంధనమనగా- *

గీ = కృత్రిమములేకనాభికిక్రిందుమీదు - బలిమిమైబంధనముజ్ఞేయవలయుదీని- పరమయోగీంద్రులుడ్యాణబంధమంద్రు- బంధములలోనసుత్తమంబంద్రుదీని- * * ** * * *

హఠప్రదీపికయందలిశ్లోకము,

ఉడ్యాణజాలంధరమూలబంధా- నున్నిద్రితాయా ఉరగాంగనాయాః- బంధత్రయాభ్యాసవిచీయమానే బంధః కతో దారుణకాలపాశాత్ * * * * * *

ఇత్యాదులు-

చంద్రమండలమువంటి సొగసగుముఖమునుగల హెకాత్యాయనిహృదయకమలమా గ్గమునుదాటి యెటువంటిఅపాయమున్నూ లేకుండగా చలించువాయువునే ప్రాణమని- హంసయని చెప్పుదురు- ఆదేస్వాము తస్వరమునాసికముద్వారా- తపిని- తాపిని- ధూమ్రమ మరీచి- జ్వాలినీ రుచి- సుషుమ్న- భోగద- విశ్వ- బోధిని - దారుణి- క్షమ- అను ౧౨ గాపొయ్యేటప్పుడున్ను- నాలుగంగుళములు కొలవడితక్కినవిచక్కగా సుమల్లివచ్చేటప్పుడున్ను గణించిచూచినట్లాయెనా ౨౧౬౦౦మార్లు: డుసు- అట్లునడుచుకాలమే అఱువదిగడియలుగల వకదినమగును వాని క్రమమంతయును మూలాధార- స్వాధిష్టాన- మణిపూరక-అనాహత

విశుద్ధ - ఆజ్ఞేయ - సహస్రారములని జెప్పంబడు పరస్థానక్రమము అగును (అనగా నచ్చోట్లనుండి కలిగినవని తాత్పర్యము) ఆప్రాణవాయువు సాధారణముగా పోవునపుడు ౧౨-అంగుళములు తిరిగివచ్చునప్పుడు ౪ - అంగుళములు తగ్గుట స్వభావసిద్ధమేకదా దీనియందు జనులు అశ్రద్ధనుంచి భారవహనము - అతినిద్ర - అతిసంచారము - సదా స్త్రీసంగమము - అమితభుక్త్యాది పాపకృత్యములయందు ప్రవర్తించుటచే పైన వివరించిన ౧౨-అంగుళములుగాక అధికము నాల్గు - ఆఱు - ఎనిమిది- పండ్రెండు అంగుళము పాఱును. అట్లుపారుటచే మిగుల ఆయుక్షీణతయు - అజ్ఞానవృద్ధియు - ఎడతెగని రోగపీడితము - మనోవ్యధయును - ఘోరమూఢవృత్తులతో ననేక జననమరణములను బొందింపజేయును - గాన వివేకులు దీనియందు మిక్కిలిగురుత్వమునుంచి యెరుకకలిగి ప్రవర్తించుకొనవలయును - దానివివర మెటులనగా, మూలాధారచక్రమందలి చతుర్దళకమలమునందు వినాయకునకు ౬౦౦ స్వాధిష్ఠానచక్రమున షడ్దళకమలమందుండు బ్రహ్మదేవునకు ౬౦౦౦ మణిపూరకచక్రమున దశదళపీఠమందు విష్ణుమూర్తికి ౬౦౦౦ అనాహతచక్రమున ద్వాదశదళపీఠమందు రుద్రమూర్తికి ౬౦౦౦ విశుద్ధచక్రమున షోడశదళపీఠమందు జీవాత్మకు ౧౦౦౦ ఆజ్ఞాచక్రమున ద్విదళకమలపీఠమందు పరమాత్మునకు ౧౦౦౦ సహస్రారమున వెయిరేకులకమలమధ్య (ఏకమేవాద్వైతబ్రహ్మంబనందగు) గురుమూర్తికి ౧౦౦౦ అంతువెరసి ౨౧౬౦౦ అగును, హంసగాయత్రీ దీనినే పరమహంసలుజపింపక జపించెదు అజపాగాయత్రియని జెప్పెదరుగ్రహింపుమా, దీనిచూచుమార్గమెట్లనగా నేనుజెప్పెదు యీస్వరశాస్త్రమును సందేహవిపరీత చలనములుమానిచూడుము - అట్లుచూచువారలు, పరముగాను అపరముగాను ప్రకాశించెడు ఒకవస్తువచేత కలిగేప్రయోజనమును చేకొందురు॥ x

చంద్రసూర్యవహ్నియను ఇడాపింగళ సుషుమ్నము
లయొక్క లక్షణములున్న వాటియందు యాత్రచే
యువారలకు కలుగుఫలములను జెప్పుచున్నారు.

ఎటులనగా,

శ్లో॥ ఇడాచవామనిశ్వాసా సోమమండలగోచరా।
పితృయానమితిజ్ఞేయా వామమాశ్రిత్యతిష్ఠతి॥

శ్లోకార్థము - ఇడానాడియని యెడమముక్కులోనివూపిరి నిశ్వాసరూపముగా చంద్రమండలము నాశ్రయించి మూలాధారాదిగా బ్రహ్మరంధ్రపర్యంతమై యుండునా నాడికి పితృయానమనియు - పునరావృత్తికి అనుకూలమని, ధూమమార్గమని యెరుంగునది.

శ్లో॥ దక్షిణేపింగళానాడీ వహ్నిమండలగోచరా।
దేవయానమితిజ్ఞేయా పుణ్యకర్మానుసారిణీ॥

శ్లోకార్థము - దేహదక్షిణభాగమందు అగ్నిమండలగోచరమై పుణ్యకర్మానుసారిణియై యుండునది పింగళనాడి యనబడును-దానిని దేవయానమనియు - పునరావృత్తిరహితమనియు తెలియతగ్గది - ఇడా అనగా నాసికయొక్క వామభాగద్వారముగుండావచ్చు శ్వాసము-దీనినే చంద్రకలయనియందురు - ఇది ౧౬ అంగుళములుపారును.

శ్లో॥ అమృతా మానదా పూషా తుష్టి పుష్టి రతిధృతిః।
శశినీ చంద్రికాకాంతి జ్యోత్స్నా శ్రీ ప్రీతిరంగదా।
పూర్ణా పూర్ణామృతః కామ దాయిన్య స్స్వరజాః కలాః॥

పింగళయనగా దక్షిణనాసికాద్వారము నందుండివచ్చు శ్వాసము - దీనినే సూర్యకలయనియుం జెప్పుదురు - ఇది ౧౨ అంగుళప్రమాణము పారును.

శ్లో॥ తపినీ తాపినీ ధూమ్రా మరీచి జ్వాలినీరుచిః।
సుషుమ్నా భోగదా విశ్వ బోధినీ ధారుణీ క్షమా॥

సుషుమ్నయనగా మధ్యనాడిక అదియందరికిన్ని సమముగానేనడుచును - దానినే అగ్నినాడికయనియునుం జెప్పుదురు - మరియు నాచం

ద్రునిగురించి చెప్పవలసితే అమృతముదీర్ఘమై ఎటువంటివస్తువనున్న కలుగజేయును - దానివర్ణము నలుపు - రాసియందు స్థిరరాసి - మన్మధాస్త్రములను తిరస్కరించునేత్రములుగలహేయుమా తక్కినవాటిన న్నింటిని చక్కగావివరించెదను ప్రియముగలిగివిను మాయనిచెప్పి మఱియు నాసుషుమ్నము నాసికకు యిరుపార్శ్వములయందు సమముగా పారితే అప్పుడుదానికి పూరణయనియు తిపోబ్రహ్మ నాడీకయనియుం జెప్పుదురు ॥ ౬ ॥

మఱియు సూర్యునియొక్కగుణము గుణములనుగురించి చెప్పవలసితే అతను యీలోకమందు వ్యాపకమైనవాడు - పరిశుద్ధమైన శుక్లవర్ణమును - రాసియందు చరరాసియుంగలవాడు - సుషుమ్నయను అగ్ని నాడికనుగురించి చెప్పవలసితే అది సకలకర్మములనున్న నశింపజేయును - దానియొక్కశ్రేష్ఠవర్ణము అగ్నివంటిమెరుపు - రాసియందు చరస్థిరరాసులు గలదిగానుండును - మరిన్ని చక్కగా తెలుసుకొని చూచి నట్టైతే యిడానాడియని చెప్పబడ్డచంద్రుడు మధ్యమజాతి- స్త్రీలింగము- పింగళనాడికయగు సూర్యుడు ఉత్తమజాతి - పుంలింగము - సుషుమ్నము గు అగ్నినాడికనైతేనో అధమజాతి - నపుంసకలింగము - ఇదియునుంగాక ఇనుపదియేనుదకు పైబడ్డ దూరదేశమునకు పోవలసినప్పుడు చంద్రకళచరించుచుండగా బయలుదేరి. సూర్యకళచరించు సమయమున ఆదేశముపోయి చేరవలయును - మఱియుంజెప్పెదవినుము హేఆర్యా.

చంద్రునిలక్షణమున్న ఆస్వరమునడిచేటప్పుడు చేయవలసినకార్యము లిట్టివియనియునుం జెప్పుచున్నారు.

చంద్రకళ యెడమముక్కుద్వారా నడిచేటప్పుడు ఏయేపనులు చేయవచ్చునని ఉమాదేవియడుగగా శంకరుడుచెప్పుచున్నాడు. ఎట్టులనగా- ఆయిడాకళయందు ఒకరిని రాయభారమునకుబంపుట- రాయభారమునకు తానేపోవుట - నూతనవస్త్రములు ఆభరణములు ధరించుకొనుట - వివాహముజేసుకొనుట -బొట్టుకట్టుట - ఒకరిని దాసిగాదీసుకొ

నుట - బావులు గుంటలు చెరువులుమొదలగునవి త్రవ్వించుట - కాపు రముచేయ తగ్గయిల్లులేక నివేశము ఇత్యాదులు వెలకుదీయుట - గృహ ప్రవేశముజేయుట - ఒకవస్తువునువిక్రయించుట - నూతనముగా రాజు నుదర్శించుట-తనకంటేయొక యంత స్తధికమైనవారలెవరైనాసరే అట్టి వారలనుచూచుట సత్యమైనవస్తువునుబొందుట - గ్రహశాంతిచేయుట- ఇష్టదైవమునుప్రతిష్ఠించుట - జ్వరమునుదీర్చుట - ద్వేషమునుదీర్చుట- ఒకరినిసమాధానపరచుట- విద్యనభ్యసించుట - ధనధాన్యాదివస్తువుల నుజేర్చుకొనుట - త్యాగమిచ్చుట - పాపవిమోచనముజేసుకొనుట - అనుఇత్యాదులు చంద్రస్వరమునడుచుచుండగా చేయుటయుచితము - తక్కినకార్యములు మధ్యమమనియెరుంగునది - అప్పుడువికసించిన తామరరేకులవంటి నేత్రములుగల హేగౌరీయని చంద్రమౌళి మరియుంజెప్పుచున్నారు ॥ ౮ ॥

సూర్యునిలక్షణమును ఆస్వరమునడుచుచుండగా చేయతగ్గ కార్యములిట్టివియనియుం జెప్పుచున్నారు.

కుడిముక్కున సూర్యకళనడుచుచుండగానే యేకార్యములను చేయ వచ్చునని విచారించినట్టాయెనా చెప్పెదవినుము. ఆచార్యోపదేశమును బొందుట తానొకరికియుపదేశించుట తానువిద్యనభ్యసించుట అన్యులకు విద్యనుబోధించుట- ఒకరికినమ్రుడగుట- శత్రుబలమును నెదిర్చితరుముట- పంటబెట్టుట- వ్యాపారముచేయుట- దొంగలించుట- జూదమాడుట - ఎవరికిన్నిసాధ్యముకాని వ్యవహారమునుమాట్లాడుట - ఏనుగు. గుఱ్ఱము. రథము. అందలము వీటినెక్కిసవారిబోవుట - ప్రకాశించతగ్గ వ్రాతవ్రాయుట- సంగీతముపాడుట- మాటలాడనారంభించుట- విరోధముకలుగజేయుట- అన్యులనుభంగపెట్టుట - కొండెములుచెప్పుట - పైశాచములనుదోలుట- మంత్రసిద్ధినుసాధించుట- ఔషధసేవజేయుట- అన్నముదినుట- దాహమునకుదీసుకొనుట - స్నానముచేయుట- నిద్రించుట- చలపతగ్గవిషమునునివర్తింపచేయుట- చెడువ్యాధులనుదీర్చుట-

స్తంభనయోగమునుసాధించుట - ఇత్యాదికార్యములుచేయుటకు ఆసూర్యకళయోగ్యమైయుంటున్నది. మఱియు ఆసూర్యచంద్రులయొక్క కార్యములనుగుఱించి ముందు చక్కగావివరించెద॥ ౯॥

సుషుమ్ననను పూరణయొక్క శూన్యఫలమును

వివరించుచున్నారు.

ఎటులనగా.

సూర్యచంద్ర కళలురెండున్ను సుషుమ్నతోకలసి పారేటప్పుడు ఏయేకార్యములు చేయవచ్చుననగా సమాధియోగముచేయుట (కరణేంద్రియములనణచి నెమ్మదిగానుండుటకు మంచిది) గాని ఆకళయందు తక్కినకార్యము లొక్కటియుకానేరదు - ఆసమయమందొకడువచ్చి అవస్తువు దొరుకునాయని అడిగితే అదిదొరకదు - సుశీలమగు తపమునుగల ఓయార్యా - ఈసుషుమ్నమగు అగ్నికళనడిచేటప్పుడు శుభసూచకములగుట యరుదు. దుష్కార్యములెన్నియైనను సఫలమగును - ఇదియునుంగాక యీస్వరము ముక్కుయొక్కద్వారములలో దేనియందు చరించుచున్నదో ఆప్రక్కకు పూరణమనియును స్వరముచరించనిప్రక్క శూన్యమనియునుం జెప్పుదురు - ఇటువంటిదైన తక్కువకాని పూరణపక్కనుంచి వ్యవహారమును మాటలాడువాళ్ళకును - తర్కముచేయువాళ్ళకును - యుద్ధముచేయువాళ్ళకును - ఒక్కదేవోయి రాజునుగాని లేక తనకంటేగొప్ప అంతస్తుగలవానిని చూచువాళ్ళకును - మరియు నిట్టి తక్కినకార్యములను చేయువార్లకును ఈస్వరము చరించుచుండగా పోయినట్టాయెనా జయముకలుగును - ఇట్లు యేయొక్కసాక్షియు లేకనే స్వరముపారని శూన్యపార్శ్వమందు నిలిచినా మీదజెప్పినకార్యములయందు ప్రవర్తించినా తనకపజయమున్ను పూరణగలవారికి జయమున్ను కలుగును - ఇదియునుంగాక ఒకమనిషి యిటువంటివాళ్ళను తనకు స్వరముపారని శూన్యదిశయందు నిలిపినట్టాయెనా వానిమాటనే మేలై చెల్లి జయముకలుగును - దేనిదేని యేయేరీతిని దృష్టినుంచి తెలుపు

కొనవలయునో ఆయారీతిగానే దానిదానిని తెలుసుకొనవలయును
మత్స్యమువంటి సొగసగునేత్రముగల ఓనారీమణీ॥ ౧౦॥

యాత్రాప్రయాణములు పోవునప్పుడు స్వరము వ్యత్యాసముగా
నుంటే అందుకు ఉపశమమును తెలియచేయుచున్నారు.

ముందు ౧౯ - దవవాక్యమందు చెప్పినప్రకారము పశ్చిమదక్షిణ
ములు చంద్రునిదిక్కులు - పూర్వోత్తరములు సూర్యునిదిక్కులు - ఇది
యిట్లుండగా పైనవివరించినరీతిని యాత్రపోవుటకు నుద్దేశించినవాడు
చంద్రస్వరములో చంద్రునిదిక్కునకే ప్రయాణముచేయవలయును -
సూర్యస్వరముగానుంటే సూర్యదిశకే ప్రయాణము చేయవలయును-
ఇందు ౭ - దవవాక్యములో వివరించినరీతి ఇరువదియామడకుపైగా
నున్నదేశములకు చంద్రునిలోబయలుదేరి సూర్యస్వరములో ఆవూరు
చేరవలసినది - ఆరీతి తానుద్దేశించినవూరు పోయిచేరుటకు తరుణభేద
మైనా లేక స్వరమువ్యత్యాసమైచరించినా (అందునకు శాంతివినుము)
ఎటులనగా సూర్యస్వరములో పోవలసినదిక్కు యొక్కయాత్రకు చం
ద్రస్వరముగానుంటే దానిని చక్కగాలోపలికిపూరించి అనగా ఆశ్వా
సమునుయీడ్చి పూరణముజేసి ఆ పాదమునే రెండుమారులుముందుబె
ట్టిపిదప క్రమముగానడిచి దారిని నిలువక తిరిగిచూడక కొంతదూరము
పోవలయును - ఇదియె దానికిశాంతి. ఇట్లుచేయుటచేత చంద్రస్వరఫల
మునశించి తానుపోవుకార్యము సూర్యస్వరమురీతి సఫలమగును-చంద్ర
కళలోపోతగ్గ దిక్కుయొక్కయాత్రకు అప్పుడు సూర్యకళగానుంటే
అదేకళను చక్కగా లోపలికిపూరించి ఆపాదమునే ముందు మూడ
డుగులుంచి పిమ్మట క్రమముగానడిచి దారిని కొంతవఱకునిలువక తిరిగి
చూడక పోవలయును. (ఇదియె నందుకుశాంతి) ఈరీతి చేయుటచేతను
సూర్యస్వరఫలము నశించి తానుద్దేశించి పోవుకార్యము సఫలంబగును-
సొగసైన లేడిపట్టికన్నులుగల పోభవానీ. ఇట్లుచేయుటచేత తాను
ద్దేశించిపోవు కార్యమెట్టిదైనా జయప్రదమగును - ఇట్లుచేయక పూ

ర్వోత్తరదిక్కులకు చంద్రస్వరములో యాత్రపోయినట్టైతే అచ్చోట నొకరికొకరు విరోధించుకొనుటయేగాక పోయినవాడు మళ్లిరానేరదు- దక్షిణపశ్చిమములకు సూర్యస్వరమునడవగా యాత్రపోయినట్టైతే స్త్రీల చేతనో - లేక వర్షముచేతనో మరణము సంభవించును - కంచుకము చేబిగించి నెగ్గటమైనభారముచే నిప్పుడేవిరుగునట్టుగా కనబడునంత సూక్ష్మమైననడుముగల హేసర్వమంగళా దీనిని విశ్వసించిచూడుమా.

ఒకరికి మంచిచెడుఅను ప్రశ్నలుచెప్పెడుమార్గమును

తెలియజేయుచున్నారు.

మనముకోరినకార్యము ఉత్తమమో అధమమో కనుగొనియెదమని అడుగవచ్చినవాడు ఇందులో ౧౦ - వవాక్యమందు చెప్పినరీతిగా సూర్యస్వరము నడిచేటప్పుడు ఆవచ్చినవాడు పూరణప్రక్కగానుండినట్టాయెనా వాడుచెప్పినవన్నియునుం అడిగినవానికి చక్కగాసిద్ధించును - అట్లుకాక కుడితట్టునిలిచినా లేక స్వరమునుచూచువాడు మీదనుండగా అడుగవచ్చినవాడు క్రిందితట్టునుండినా లేక సరివెనక నుండియడిగినా ఆసూర్యకళకు తగినఫలమే చెప్పవలయును - చంద్రస్వరము నడిచేటప్పుడు అతను ఆపూరణప్రక్కనేయుండి ప్రశ్నచేసినట్టాయెనా వాడు చెప్పినవన్నియును అతనికి ఫలించును- అట్లుగాక ఎడమప్రక్కనిలచినా లేక సరిముఖమై యెదటనిలచినా పైప్రక్కనుండినా ఆచంద్రస్వరము నకుగలగుణమునే చెప్పవలయును - ఇదితప్ప స్వరముపారని శూన్యపు తట్టునుండి అడిగితే వాడడిగినకార్యములన్నియు చెడ్డదగును - ఫలించ నేరదనియే చెప్పవలయును - మరియును వాడుమొదట నోరుదెరచిచె ప్పినమాట యొక్క అక్షరములను యెంచిచూచి బేసిగానుంటే సూర్య లక్షణమును చెప్పవలయును - సరియైతే చంద్రగుణమును చెప్పవల యును-పైనక్రిందుఅన్నది మెద్దెయింటినిన్ని భావిమొదలగు పల్లపుభూ మియని యెంచుకొనవలయును - ఈరీతిని ఐదుఆఱువిధములుగా చెప్ప

బడియున్నదే - ఇవియన్నియు యొకకాలమందే అమరియుండవలయు నన్నదికాదు - ఏదైనావొకటనిచూచి చెప్పవచ్చునని తాత్పర్యము-మతి న్ని సంగతులను తటస్థమైనచోట్లయందు చూచుకొనవలయును- ఇంకను విస్తరించి చెప్పవలయునంటె చంద్రునిపార్శ్వమున్ను. ఆదిక్కును. (ఆకళ పూర్ణమైనాసరే) కించిత్తుమధ్యమము - సూర్యునిదిశయును - పక్కయును (అవి శూన్యమైనాసరే) అదిత్రుణమైనాగాని శుభమేకలు గును - గాని వ్యర్థముకానేరదు - ఇందుకుప్రమాణము ౬-వ వాక్య మందును ౭-వ వాక్యమందును చంద్రుని స్థిరరాసియనియును- సూర్యు ని చరరాసియనియును చెప్పియుండుటను కనుంగొనవలయును॥౧౬॥

క్రింది పదియవవాక్యమునందు వివరించియున్న పూరణ శూన్యములయొక్క వికల్పమునుచెప్పుచున్నారు.

ఒకడువచ్చి (నేను యిందువలన) చెడినాను అనినా నేనిట్టిదిపోగొ ట్టుకొన్నాననినా - పాముకఱచినది - లేక విషముతినినాను - ఇదిగో పడకలోనే ప్రాణముపోతున్నది - అనునవి మొదలగుచెప్పబడ్డ అపా యమగుగుణచేష్టలు ఎటువంటివైనాసరే - స్వరముపారని శూన్యదిశ గావచ్చి నిలిచిచెప్పినట్టైతే ఒకకష్టమున్నురాదు. నివర్తిమై పోవునని చెప్పవచ్చును. (ఆరీతిగాక స్వరముపారుతూవున్న పార్శ్వమగు పూర ణదిశగావచ్చి నిలిచిచెప్పినట్టైతె ఆవచ్చినవాడు ఎటులనెటులచెప్పినా డో అటులనటులనే లభించును - పోగొట్టుకొన్నవస్తువరాదు - విషము తిరుగదు- పడకలోనిరోగి తేరదు- మఱియు శూన్యములోయెవడైనా వచ్చి ఏదైనాచెప్పినట్టులయితె అట్టిది వొకానొకకాలమందు అబద్ధ మైనానగును-పూరణలోచెప్పినమాట ఒకానొకప్పుడు నిజమైననగును- మరియునుఆదేసర్పము పడిగవంటిమదనాగారముగలవో హిమశైలతన యా అట్లువచ్చినవాని దిశనుగుఱించి క్రిందటి ౧౨-వ వాక్యమందుచె ప్పియున్నరీతిని వాడువచ్చినదిశ చంద్రాంశముగానున్ను మొదటచెప్పిన మాట సూర్యాంశముగానున్ను వున్నయెడల మీదచెప్పినకార్యములకు

కొంచెము మధ్యమమగునుగాని బొత్తిగా మోసముకానేరదు - మఱి
యుంజెప్పెద వినుము॥ ౧౩॥

## గర్భచిహ్నలను జెప్పుచున్నారు.

ఒకమనిషివచ్చి గర్భములోనిశిశువు యెటువంటిదని యడిగేకాల
మందు వచ్చిన ఆమనిషి ఒకజీవునిపై నెక్కియుండినా లేక జీవముగల
యొకటిని చేతబట్టుకొనియుండినా లేక ఒకజీవుని అంటుకొనినిలచియుం
డినాగాని అతనునిలచినదిక్కు దక్షిణమై అందులోనదిపూరణగానుంటే
మొగశిశువు పుట్టుననియును - ఎడమభాగమై పూరణగానుంటే ఆడబి
డ్డనియును - ఆరీతి పూరణపక్కగాక శూన్యపక్కగానుండి దేనినేనిము
ట్టుకొనినిలచినాగాని లేక ఊరకనిలచినాగాని కుడిపార్శ్వమైతే మొగ
శిశువు - ఎడమపక్కనైతే ఆడశిశువుపుట్టును - అట్లుపుట్టినబిడ్డ చచ్చు
నుగాని బ్రతకనేరదు - అప్పట్లో స్వరమునుచూచేవానికి సుషుమ్నము
గానుంటే మొగబిడ్డయు - ఆడబిడ్డయుగాని జేడిగానుండునని జెప్పవ
చ్చును - ఈప్రకారమువచ్చినవాడు యెదట కుడితట్టుగానిలచి తనకా
ర్యమును చెప్పుకొంచూ యెడమతట్టుకువచ్చి నిలచినట్లాయెనా గర్భ
మందున్న ఆశిశువు తల్లికిసంకటమిచ్చి తర్వాత వుర్భవమగునని చెప్ప
వచ్చును॥ ౧౪॥

## మఱియు గర్భచిహ్నమున్ను యుద్ధమందు జయసూచకమునుం జెప్పుచున్నారు.

ఈపైనజెప్పిన వాక్యములో శూన్యమందడిగిన ఆబిడ్డ చచ్చునని చె
ప్పినాగాని యుద్ధము - వాదము - జగడమునుగుఱించి ఒకమనిషివచ్చి
ఇట్టిట్టివారలలో యెవడుజయించునని అడుగవచ్చినవాడు సూర్యపక్ష
మందుండి అడిగెనా అందులోమొదటివాడు వోడును. పూరణమైతే
రెండవవాడు వోడును. ఆసమయమందు స్వరమునుచూచేవానికి సుషు
మ్నమైతే ఆయిద్దరున్ను సమాధానమగుదురు - మఱియు పోట్లాట,

ఋగడము, వాదము సంభవించినవానికి అప్పట్లో సూర్యస్వరము గానుం టే జయించుకొనును. చంద్రస్వరముగానుంటే వోడును - సుషుమ్న ముగానుంటే సమాధానమైపోవును. ఆరీతి చంద్రస్వరమునడిచి తనకు జయముకావలయునంటే ఇందు ౧౧ - వవాక్యములో వివరించినప్రకా రము స్వరమును లోపలికిపూరించి పూరణచేసుకొని ఆస్వరమునడిచే పాదము నేముందిడి ఐదడుగులుపోయి తర్వాతఎదిర్చినా తప్పక జయ మునుబొందును - ఇది యథార్థమని యెఱుంగుము॥ ౧౫॥

స్వరముయొక్క స్పర్శమును దెలియజెప్పుచున్నారు.

ఇడా పింగళ సుషుమ్నములనిచెప్పబడ్డ ఈమూడుస్వరములనున్ను వాటిఫలాఫల యనుభవములనున్ను పరీక్షించి చూచేకాలమందు సరి యయ్యేవచ్చును - ఆనాడులతో పంచభూతములుచేరి నడవడమున్నక లదు - వాటిని వాదుకపఱచి యెఱింగియనుభవించుటే ప్రయాసగా నుండును - అదియెట్లనగా ముక్కునుంచివచ్చేడుస్వరము ఆముక్కుదం టు నంటివచ్చినట్టాయెనా ఆనాడి పృథివియంశమని యెఱుంగునది. అ థోముఖముగా పారినట్టైతే జలాంశమని యెఱుంగవలయును. ఊర్ధ్వ ముగాపారినట్టైతే తేజోంశమని తెలుసుకొనవలయును. ఆదంటునకు సమమైన మఱియొకతట్టుగాపారిన వాతాంశమని గ్రహింపవలయును- ఈరీతిగా నాలుగుప్రక్కలలో ఒక్కవైపనిలేక అన్నిపార్శ్వములయం దున్ను కలసినడిచినట్టైతే గగనాంశమనివూహించి లోకులకు తెలియ జెప్పుము - ఈపంచభూతాత్మను కుడియెడమలకు ఒక్కటేప్రకారమున డుచునని తెలుసుకొనవలయును॥ ౧౬॥

స్వరముయొక్కరూపము వర్ణము దాసిరసజ్ఞత యునుం జెప్పుచున్నారు.

పంచభూతాత్మస్వరము నడుచుటనుగుఱించి మఱియు నేప్రకారమె ఱింగి తెలుసుకొనవచ్చుననగా పృథివిస్వరము బంగారుఛాయగాను -

అప్పుస్వరము తెల్లవర్ణముగాను - అగ్నిస్వరము ఎఱ్ఱగాను - వాయు స్వరము నల్లగానుండును. అప్పుడు కంఠమందెట్టి రుచికనబడునంటే పృధ్వికికరము తియ్యనగానుండును. జలమునకు వగరుగానుండును. అగ్నికి వుప్పునగాలేక కారముగానుండును. వాయువునకు పుల్లగానుం డును. వాటిరూపము లెట్టియనగా పృధివి అష్టకోణము. అప్పు రెండ మిదికళల చంద్రునివలెయుండును. అగ్ని మూడుమూలలు గలదిగానుం డును. వాయువు ఆఱుకోణములు. మఱిన్ని అదియదిపారేటటువంటి నిడివిచెప్పవలసితే పృధివి పండ్రెండంగుళములు. జలము పదియారు అంగుళములు. తేజస్సు రెండుమిదిఅంగుళములు. వాయువు నాలుగుఅం గుళములు. అని యెఱుగతగ్గది - ఇదియునుంగాక యీవాక్యమందు రస మని ప్రత్యేకముగా చెప్పియున్నందున ప్రథమతః రసమునేయెత్తుక్కోవ లసివచ్చెను - లోకులకు చెప్పవలసినప్పుడు యీభేదములను వారలు తెలుసుకొనుట దుర్లభమని ఒకభూత్యమునకు నాలుగుగురుతులు చె ప్పియున్నాము - ఒకటియందు సాధ్యము కాకపోయినప్పటికిన్ని మరి యొకటియందైనా తెలుసుకొందురని యెఱుంగవలయును హేగిరిరా జపుత్రీ ॥ ౧౭ ॥

ఇదియునదే ఆయాభూత్యములు నడుచునప్పుడు చేయుకర్మ

ములయొక్క గుణాగుణములను చెప్పుచున్నారు.

ఆకాశభూత్యము నడిచేటప్పుడు దానివర్ణము స్ఫటికము-రసము కంఠము చేదుగానుండును-రూపము వర్తువ-పొడువు ఒక అంగుళము- ఈరీతి భూత్యములయొక్క గుణాగుణములను చెప్పవలసితే పృధివి - అప్పు యీరెండునుత్తమము - అగ్నిమధ్యమము - వాయువు - ఆకాశ మధమము- సొగసగుగాజులనుధరించిన హేహిమరాజతనయా- స్వర మునుజూచి గురితెల్పేవానికి తాంబూలమునిచ్చి ఉపచరించి పిదపయు మగవలయును - ఇట్లుండగా క్రిందటి ౪ - ౮ - వ వాక్యములయందు చెప్పినచొప్పున సూర్యచంద్రకళలయందు చేయవలసినకర్మములన్ని

యు ద్ధీవాక్యము ననుసరించేయుండవలసినది - ఈముందుచెప్పబోవు ౨౮-౨౯-వవాక్యములను చూచుకోతగ్గది - అంతకంటే స్వరమునుచూ చేవాడు తాంబూలమునుధరించుకొని చెప్పడము (ఉభయులకుఅనగా) అడిగేవానికిన్ని చెప్పేవానికిన్ని మిగుల శ్రేయము॥ ౧౮॥

ఒక్కడునామమును జెప్పి ప్రశ్న చేసితే వానికిచెప్పతగిన

వాటిక్రమమును దెలియజేయుచున్నారు.

క్రిందటి ౧౫ - వవాక్యమున వివరించినప్రకారము ఇద్దరినిగుఱించి చూపకయే శూన్యస్వరము దిక్కుననుండక పూర్ణదిక్కులోనుండి యు ద్ధమునకుబోవువాడు యేమగునని అడిగెనా ఆపోవువాడు ఆయుధము చేత ఘాతపొందివచ్చు ననియునుం జెప్పవలయును- మఱియు అప్పుడు పృథివినడిచెనా వీపున దెబ్బతగులుననియును - జలమైతే కాలియందు ను - అగ్నియైతే యెదయందును - వాయువుగానుంటే చేతియందును- ఆకాశమైతే శిరమందుతగులుననియునుం జెప్పవలయును - సాక్షాత్తు త్రిమూర్తులువచ్చి అడ్డపడినా తప్పించుకొనిరాదని దృఢముగా చెప్ప వలయును॥ ౧౯॥

ఇట్టిభూతత్త్వమునకు ఇట్టియాయుధమనియు అప్పట్లో

నిట్టితావులయందుండే యుద్ధముచేయవలెనని

యునుం జెప్పుచున్నారు.

పైన వివరించినప్రకారము యుద్ధముచేయ వలసియున్నప్పుడు వా యుమూల మొదలుజేసుకొని ఆగ్నేయమూల తుదగా ఒక్కదారమును బట్టినరీతిని క్రమముగాభావించి అందులో పశ్చిమదక్షిణములను చం ద్రాంశముగా గుఱించుకొని యుద్ధముచేయువానికి అప్పుడు సూర్యస్వ రము పారినట్టాయెనా తానున్న ఆసూర్యదిశగానే నిలచి శత్రువును చంద్రదిశలోనిలిపి యుద్ధముచేయవలయును - అట్లు చేయుచూరాగా చంద్రుడైనాసరే సూర్యుడైనాసరే యెత్తి ప్రయోగించతగ్గఆయుధ

ములేవియనగా - ఆకర్ణాంతదీర్ఘమైన మీనమువంటి నేత్రములుగల హేఅంబికా పృథివిగానుంటే - కత్తి-జలముగానుంటే పరశువు- అగ్ని యైతే ధనుస్సు - వాయువైతే దండము- ఆకాశమైతే రాళ్లు - ఈచొప్పన ఆయాభూతములకు ఆయాయాయుధములను ధరించి విద్యుక్తముగా ఆయాభూమియందు నిల్వంబడి యుద్ధముచేసినట్టాయెనా అట్టివాడు తప్పక జయమునుబొందును॥ ౨౦॥

వ్యాధినిన్ని దానినివర్తిల క్షణములనున్ను
తెలియజేయుచున్నారు.

పురుషుడు తెచ్చుకొన్నవ్యాధికి పురుషుడేవచ్చి స్వరముచూచేవానినికని యీవ్యాధి తీరునాయనియడిగితే ఆవ్యాధి గుణమగును - స్వరమునుచూచేవాని కుడిపార్శ్వమందు నిలచియడిగినప్పటికిన్ని నివర్తియేయగును - సంశయములేదు. ఆడదిపొందినవ్యాధికి ఆడదేవచ్చి యడిగినట్టాయెనా గుణముకలుగును - అట్లువచ్చిన యాయాడది ఆస్వరముచూచేవాని కెడమతట్టుగానిలచి అడిగినా వ్యాధితీరును - సందేహములేదు. పూర్వపు ౧౩ - వవాక్యమందు చెప్పినరీతిని శూన్యదిశగానిలచినా నుత్తమమే. ఈరీతినిగాక పురుషునినిమిత్తం స్త్రీగాని స్త్రీనిమిత్తం పురుషుడైనాసరే వచ్చిఅడిగినట్టాయెనా ఆరోగముతీరుటకాదు స్థిరము. మఱియు ఒకమనిషి కుడితట్టుగానిలచి స్వరమడుగుతూ యెడమభాగమునకు వచ్చినిలచినాగాని ఒక ఆడమనిషి యెడమతట్టునిలచి స్వరమునడుగుచూ కుడిపార్శ్వమునకువచ్చినిలచినాసరే ఆవ్యాధితీరుటకష్టము-గాని నిదానముగా దినములవెంబడి గుణమగును - ఆయాప్రకారము క్రమముగావచ్చి అడిగిన నారోగము మానును. అందులోనహా యెప్పుడుతీరుననియడిగితే అట్టివేళ భూతము పృథివిగానుండెనా కొద్దిదినములలో తీరుననవచ్చును. జలముగానుంటేశీఘ్రములో ననవచ్చును - అగ్నియైతే మూడుదినములకు విమోచనమనవచ్చును-అందుకధికమైతే చంపును - వాయువైతే రెండుదినములకు గుణముమించేనా చచ్చును-

ఆకాశమైతే ఆదినమేనివతిణ-మించెనా పంచత్వమొందును-అని నిస్సం
శయముగా చెప్పవచ్చును॥ ౨౧॥

> ఇందులో యింతకుపైవాక్యమందు చెప్పినక్రమమున్ను -
> ఆపెనకటివాక్యములయందు వివరించిన భూత్యములగు
> ణములున్ను ఆపెనక ౯ - వవాక్యములో వివరించినరీతిని
> స్వరముచూచేవాడు ఒకచోటికిపోవలసిన తరుణమిది
> యనియు మాటలాడవలసిన కాలమిదియనియునుం జెప్పు
> చున్నారు, * * * * *

ఈపైవాక్యమందు చెప్పియున్న భూత్యముల స్వాభావిక మా
దిగాగలగుణములకు తగ్గవాటిని చెప్పగూడదు- దానిపైని ౧౦-వవాక్య
మందు చెప్పియున్న ప్రకారము సుషుమ్నము నడిచినట్టాయెనా అవునన్న
దికాదు - కాదన్నదగునట్లు ఇప్పుడున్ను యొకమనిషి వ్యాధినిగురించి
అడిగేటప్పుడు సుషుమ్నము నడిచినట్టాయెనా ఆరోగి ఐదు దినములలో
చచ్చును - అట్లు చావకతప్పెనా అతనికి వేరేవిపత్తు వచ్చేపర్యంతము
న్ను చావదు - ఇదిసత్యము. మఱియును ౧౪-వవాక్యమందు వివరించి
నమేరకు ఒకప్రక్క పారేస్వరములో ఐదువిధముల భూత్యములున్న
వి - అభూత్యము నాల్గు-క్క-ట్యందు ఐదేసిభాగములు విభక్తమై
నడుచుటగలదు. అదియేలాగంటే - ఒకపృథివికి పృథివిలోపృథివి పృథి
విలోఅప్పు పృథివిలోఅగ్ని పృథివిలోవాయువు పృథివిలోనాకాశము
ఇట్లు ఐదింటనైదుభూత్యములున్ను పారును - ఇదియునుంగాక యీ
శాస్త్రముయొక్క ప్రయోజనమంతయును గురుముఖముగా తెలసికొ
నవలసినదేకాని దేవతలకైనా ఆచార్యునివినాగా శాస్త్రమునుబట్టి
తామే స్వానుభవమును తెలుసుకొనుట దుస్తరము - మఱియు స్వర
మునుచూచేవానిని యొకమనిషివచ్చిపిలచితే వాడు తనకుసూర్యస్వర
ముపారేటప్పుడే పోవలసినది - ఒకరితో మాటలాడవలసినా శకునము
చెప్పవలసివచ్చెనా సూర్యస్వరములోనేపోయి మాటలాడవలయును-

గుతిన్ని అప్పుడే చెప్పవలసినది - తక్కినస్వరములందు కూడదు - ఇది తప్పి నడిచినట్టాయెనా మధ్యమమగునని యెరుంగునది - మఱియుంజె ప్పెద సావధానముగావినుమా హేయుమా॥ ౨౨॥

ముందు ౧౬-వవాక్యమందు చెప్పిన భూతస్వరముల

క్రమమును జెప్పుచున్నారు.

హేపార్వతీ నెమ్మదితో నాలకింపుమా - ముందు ౧౬-వవాక్య మందు వివరించియున్న భూతస్వరములయొక్క క్రమమును చెప్పున ప్పుడు పృథివికిన్ని అప్పువుకున్ను మేలేకలుగును ౩౩-వవాక్యమందు చె ప్పినరీతిని ఐదుగతియలకంటె మించినడవగా ఆరెండుభూతములున్ను అధికముగా నడిచినట్టాయెనా లాభముకలదు - కావలయునంటే ౧౮-వవాక్యమును చూచుకోనవచ్చును - ఇదిట్లుండనిమ్ము. ముందు ౧౪వవా క్యమందు చెప్పినప్రకారము ఒకప్రాణి నంటకయును దానిపైనెక్కి యుండకయును ఒక్కడై వచ్చి శూన్యములోనిలువక పూరణయందుని లచి గర్భచిహ్నమును యడిగేటప్పుడు స్వరము పృథివిగానైనా లేక జ లముగానైనానడిచెనా తొలుగశిశువుపుట్టుననుము ౬-వవాక్యమందు చె ప్పినలాగున శాంతిచేయుట - దిగదొడుచుట - చేయవలసినప్పుడు అట్లు చెప్పినకళయందు యీరెండుభూతములలో యేదైనా యొక్కటినడి చేటప్పుడు జేసినట్టాయెనా నదిఫలించును - ఇదివినాగా తేజోభూత మునడవగా యుద్ధముజేసినట్టాయెనా జయముకలుగును-ఆయుద్ధమందు పరశువుయెత్తితే మధ్యమమగును - అయ్యెడ గర్భమునుగురించియడిగె నా ఆగర్భము నశించిపోవును-వాయువునడిచెనా స్త్రీశిశువగును-యుద్ధ ములో అపజయమునుబొందును - ఆకాశమంటే ధనుర్విద్యకుగెలుపు- ఈయుద్ధలక్షణమునుజెప్పిన ౧౦-౧౮-౨౦-వవాక్యములను చూచుకోన వలసినది. ౯-వవాక్యమందు జెప్పినప్రకారము యోగముచేసినట్టాయెనా మంచిది - ఆకాశాంశముచరించునప్పుడడిగెనా ఆగర్భము నపుంసకమై పుట్టి మరిచచ్చును అని చెప్పవలయును॥ ౨౩॥

తిథి- వార- నక్షత్రముల కాలఫలమును ఇందు ౮-౩౫-వ
వాక్యములయందు వివరించినప్రకారము ప్రాతఃకాల
మున స్వరమును చూడవలసినదానికన్నను విశేషముగా
చూడతగ్గకాల మిదియని చెప్పుచున్నారు. *

ముందు ౮-౩౫-వవాక్యములయందు వివరించియున్న ప్రకారము ప్రాతఃకాలమందు స్వరమునుచూడవలసిన క్రమముకంటే విశేషముగా చూడతగ్గ దెట్లనగా- ఉషఃకాల మైదుఘడియలు అనగా నాలుగుఘంటలకులేచి ముందు ౮ - వవాక్యములో చెప్పినప్రకారము స్వరమునుచూచేటప్పుడు అమావాస్యకు సూర్యుడు - పున్నమకు చంద్రుడు - గాను దర్శించవలయును. శుక్లపక్ష ప్రథమ-ద్వితీయ-తృతీయలకుచంద్రస్వరమే నడియవలయును- ఈరీతి క్రమముగానడిచిన పునహః అమావాస్యవఱకు జయప్రదమగును - కృష్ణపక్షం పాడ్యమి - విదియ - తదియ - యీదినములయందు సూర్యస్వరము తప్పకనడిచెనా మరి పౌర్ణమివరకు జయమే - అట్లుగాక సూర్యునకు చంద్రుడున్ను - చంద్రునకు సూర్యుడున్ను తప్పినడిచెనా ౧౧-వవాక్యమురీతినిసమపఱచుకొనవలయును-అట్లు చేయుటచే దోషనివర్తియగును - ఉగాదిమొదలు మూడుదినములు చంద్రుడులేకపోయెనా లేక ఐదుదినములు వారస్వరము- ఆయావారమునకుతగ్గట్టు నడవకుండినా ఆమనిషి మఱియొకయుగాదిని చూడజాలడు - ఈప్రకారము ఆయాస్వరము ఐదుగడియలుతప్పక నడియవలయును - అట్లు తప్పినడిచెనా గడియకు ఇరువదిసంవత్సరములవయస్సువంతున తగ్గిపోవును అనియెరుంగుము - వారిలక్షణము, ఆదిత్యమంగళశనివార ముపగులున్ను - కృష్ణపక్షగురువారములున్ను సూర్యస్వరము నడుచుచుండవలయును. సోమ- బుధ- శుక్రవారము- శనివారమురాత్రి శుక్లపక్షగురువారములున్ను చంద్రుడు నడుచుచుండవలయును - ఈరీతి పుట్టుస్వరము యేభూత్యమందు కలుగవలయునంటే ముందు ౮౫-వ వాక్యమును చూడవలయును - ఇందుభూత్యములు అధికముగామించి

పారినట్లైతే ప్రయోజనము లేట్టివియనగా [illegible]వాక్యమందు యును - మరిన్ని దానివివరమును ౩౩-వ వాక్యమునుజూచి తెలుసు నవలయును॥ ౨౮॥

ఇందులో నక్షత్రములకు నడువవలసిన కాలస్వరమున్ను ఈ పైవాక్యములో వివరించినవారములకు కాలస్వరము క్రమముగానడిచెనా హానిలేదనియును తప్పినయెడ యిట్టిదిట్టిదికలుగుననియునుం జెప్పుచున్నారు. * * *

ఓ పార్వతీ తిథి - వారము అని రెండువ్యత్యాసముగా చెప్పినామని శంకించుకొనవద్దు - దానివివరము ముందువాక్యములో చెప్పియుండుటనుచూడుము - ఈ రెంటియందున్ను అడుగున రాబడ్డ నక్షత్రఫలమగు దానియందున్ను యేదేదికష్టమో యేదేదియిష్టమో తెలసి (వాపు - రూపుమాపు) వీటినిగుఱించి చూడవలయుననుట ఎఱిగి దృఢముగానుండుము - నక్షత్రములకు నడవవలసిన కాలస్వరమెట్లనిన. పుబ్బ-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-విశాఖ-అనూరాధ-జ్యేష్ఠ-మూల-రోహిణి-శతభిష-ఉత్తరాభాద్ర-యీ ౧౨-డును సూర్యునివి - తక్కిన ౧౫-న్నున్ను చంద్రునివి - మఱియును ముందువాక్యములో చెప్పినవారములకు యోగ్యములైన కాలస్వరములయందు ఆదిత్యవారము సూర్యుడుతప్పితే వ్యాధి శని - సూర్యుడులేకుంటే దరిద్రమేగాక అర్థనాశం- మంగళ సూర్యుడులేకుంటే పోరు - చావును గలుగును - కృష్ణపక్షమందు సూర్యుడు - శుక్లమందు చంద్రుడు - గురువారమందు లేకుంటే తనరాజుకుచేటు - బుధ చంద్రుడులేకుంటే ఆవూరియధికారికి అనర్థము- సోమ చంద్రుడులేకుంటే బంధుహాని - తనరాజుయనుట స్వరముచూచేవాని వూరియధికారియని భావము-శుక్రునికి చంద్రుడులేకుంటే ముందువివరించిన వాక్యమును చూడుము॥ ౨౫॥

ముందటివాక్యములో వివరించినరీతి శుక్రవారము నాడు చంద్రుడులేనియెడ జరుగు కార్యము లివిగా[illegible]





యును మరితిథులు తప్పినప్పుడు కాగలవి ఇవియని
యును తెలియజెప్పెదరు, * * * *

శుక్రవారమునందు చంద్రుడులేకుంటే తానువసించుస్థానము విడచిపోవలసిగాని లేక ఆయిల్లువిడచి వేరేయిల్లులోపోయి నిలువవలసినదిగానైనావచ్చును - ఆరోగ్యముతప్పును - తనభార్యకు మరణముగాని దానికిసమానమైన జగడము ప్రేమహాని రోగముమొదలగు సంకటములుకలుగుటయును - సతిపతులకుగల పొంతనముసహా నశించుననియెరుంగునది - అంటే ఆశుక్రవారమందు చంద్రుడుండెనా వారలుదేవతలై యష్టసిద్ధులునుగలిగి యుందురనుటకు యేసంశయమున్నుండదని గ్రంధకర్త అభిప్రాయము- మఱియు దీనియందుజెప్పినరీతిని ఊరికిన్ని-రాజుకున్ను-అధికారికిన్ని- వచ్చినావచ్చును. పైగా శుక్లపక్షమందు ప్రథమతప్పితే ఏదేని అపాయమువచ్చును - ద్వితీయతప్పితే కలహమును - తృతీయకు ద్రవ్యహానియు - చతుర్ధికి యాత్రయు - సకలవిధనష్టములున్ను కలుగును - అనియెరుంగునది, పంచమి బంధువులకువ్యాధి- షష్టికి ఆదేశస్థులకున్ను- ఆరాజుకున్ను - కష్టము సంప్రాప్తమగును- సప్తమి తనదేశపురాజుకున్ను దేశస్థులకున్ను నలుకువకలుగునేగాని తనకులేదని యేమరియుండరాదు - తనవల్ల వారలకు సంకటములువచ్చెనన్న అపనిందచేతగాని కార్పణ్యతచేతగాని తనకున్ను కష్టముసంభవించుననుట సిద్ధము. ఇది ముందువాక్యములోనే వివరించియుండుటను గమనించతగ్గది.

తిథులుతప్పినయెడ కలుగునవి యిదియనియును సూర్యచంద్రుల స్వభావమునుసహా తెలియజేయుచున్నారు.

అష్టమితప్పితే వ్యాధితో చావుసహా కలుగును-ఇది శుక్లపక్షము-కృష్ణపక్షమున్ను యిదేయర్థమని యూహించుకొనవలయు - మరియును సూర్యునియందు చంద్రుడున్ను చంద్రునియందు సూర్యుడున్ను మరుగైతోచుటయు గలదు. దీని నాగారిదేవి తన స్వసామర్థ్యముచే తెలుసుకొనజాలక కలవరించి పిదప ఆమహేశ్వరులకృపచేత నెరుగతగ్గ తెలివిగలిగెననగా తక్కిన యీమనుష్యాదులెట్లు యీశాస్త్రి

నుభవమును తమకు తాదెలుసుకొనియెదరు - తెలుసుకొనజాలరుగాన
ఆచార్యునికృపను బొంది తెలుసుకొనవలయును-అతిసూక్ష్మగ్రాహ్యు
లకేగాని తక్కినవారలకు దుర్ఘటమైయుండును॥ ౨౬॥

మీదవివరించిన స్వరముతప్పితే హానికలుగును - అట్లుకలుగక
నుండునిమిత్తం దానికి పరిహారము చెప్పుచున్నారు.

హేగౌరి ముందువివరించిన వాక్యములప్రకారము కాలస్వరము
క్రమముగానడుచునా అంటే నడవదు - ఆస్వరము వారివారి కర్మా
నుసారముగానే నడుచును - దానిని మనవశముచేసుకొనుట శక్యమా
యని యధైర్యమును పొందబోకుమా - స్వరమునుచూచేవాడు పైవా
క్యములో వివరించినరీతి ప్రాతఃకాలము అరుణోదయమునకు ముందే
లేచి ఆదిత్యమంగళవారములకు దక్షిణదిశగా మూడడుగులుముందు
౧౧-వవాక్యప్రకారము స్వరమునుపూరణచేసి ఆపాదమునే ముందిడి
కొనిపోవలయును - గురుశనివారములకు మూడడుగులు పశ్చిమముగా
పోవలయును- సోమ శుక్రవారములకు నాలుగడుగులు ఉత్తరముగాపో
వలయును - బుధవారమునకు రెండడుగులు తూర్పుగాపోవలయును -
ఈరీతిగాపోయివచ్చి ఒకదివ్యమైన ఆసనమందుండుకొని సర్వాంతర్యా
మియగు నన్నుగూర్చి త్రికరణశుద్ధిగా ధ్యానముచేసి పిదపలేచి ఎక్క
డికివెళ్లినా లేక అచ్చటనేయుండినా పైవాక్యములయందు చెప్పియున్న
విపత్తులెన్నివచ్చినాగాని మాకృపచే నివారణమగును॥ ౨౭॥

ఇంతకుముందు వివరించినప్రకారము ఒకవారము
వరకు స్వరముతప్పినయెడ కలుగునవి యిట్టివియని
యు ఒకవారమువరకు స్వరము క్రమముగానడిచిన
కలుగుఫలమిట్టివియనియునుందెలియజెప్పుచున్నారు

హేసతీ వీటినన్నింటిని చక్కగానూహించి తెలుసుకొనుమా -
సూర్యునికాలమందు చంద్రుడును- చంద్రునికాలమందు సూర్యుడున్ను
భేదించి ఒకవారము అనగా యేడురోజులు ఒక్కరీతిగా నడిచినట్లైతే

యెనా అట్టివాడు తప్పకవచ్చును - అట్లుగాక మీదచెప్పినరీతిని యేడు దినములున్ను క్రమముతప్పక గడియలులోపింపక దిక్కు-నుసహా చేరి నడవడముతో ప్రాణాయామమున్ను భేదించక చరించినట్టైతే ఎటువం టిరుజులున్ను లేక సుఖజీవియైయుండును. యముడున్ను చేరడు ప్రాణ మునకు హానియుసహా లేదు - జీవన్ముక్తుడై చిరకాలము బ్రతికియుండు టయేగాక అష్టసిద్ధులున్ను వానికి కైవల్యమైయుండును - ఇదిసిద్ధము.

గుటి జెప్పుమార్గమును తెలియజేయుచున్నారు.

స్వరమునుచూచేవాడు రేచకముచేయుచుండగా యెవడైనావచ్చి ప్రశ్న అడిగినా ఆకార్య మెంతయుసిద్ధింపదు- పూరకమైతే అవశ్యము సిద్ధించును - వాడుచెప్పినవన్నియు యధార్థముగానే జరుగును - కుంభకమైతే మంచిది - కార్యసిద్ధియగును. మలః- జల-అపానవాయు వులు విసర్జించుకాలమందు అడిగినా శత్రువులునశింతురు - మరియు దీనివివరమును గురుముఖముగా తెలుసుకోతగ్గది - అట్లుచేయక నాదు మర్మము గోచరింపదు॥ ౩౦॥

శనిగురువారముల స్వరఫలమిట్టిదియని చెప్పుచున్నారు.

శుక్లపక్షపు గురువారమునకు చంద్రుడున్ను - కృష్ణపక్షపు గురువా రమునకు సూర్యుడున్ను - తప్పక నడుచుచూవచ్చినట్టాయెనా అతిశ్రేయ ముతో జీవన్ముక్తుడై జ్ఞానసంపత్తిగలిగి యేకొరతయులేక జీవించును- మరియు శనివారమునకు రాత్రియందు చంద్రుడున్ను - పగటియందు సూర్యుడున్ను - తప్పకనడిచినట్టాయెనా యీలోకమంతయు మెచ్చతగ్గ శ్రేయస్కరమును పొందును- గాని వీటిని యింతకుపైన కాలస్వరము నుగురించి చెప్పియున్న ౮-౩౮-౩౪ యీవాక్యములసంగతులను లక్ష్య ములోకి తెచ్చుకొనిచూడుము॥ ౩౧॥

పునహా గుటి జెప్పుమార్గమును వివరించుచున్నారు.

ఒకమనిషివచ్చి ఫలానవాడు యెచ్చటనున్నాడని ప్రశ్నచేసితే అ ప్పుడు స్వరముపృథివియైతే ఇంటిలోనున్నాడనియు - జలమైతే ముంగి

టిలోనున్నాడనియు - అగ్నియైతే ఆగ్రామపుయెల్లకులోగానే యున్నా డనియు - వాయువైతే యెల్లదాటినాడనియును - ఆకాశమైతే పర్వత మెక్కుచున్నాడు లేక నిద్రించుచున్నాడనియు జెప్పవలయును-మఱియు అన్యదేశమునకు పోయినవానినిగురించి యడిగినట్లైతే పంచభూత్యము లలో మొదటిభూతముగానుంటే ఆదేశమందే స్థిరమైయున్నాడనియు- రెండవభూతమైన మళ్లి వస్తున్నాడనియు - మూడవభూతమైతే తిరిగిన వాడు యెక్కడనిలువక వస్తున్నాడనియు - నాల్గవభూతమైతే వాని స్వగ్రామమునకు లోపలవచ్చినాడనియు - ఐదవభూతమైతే వాకిగ డియకులోగా వచ్చి యిల్లుచేరుననియునుం జెప్పవలయును - మరిన్ని ఆయాభూత్యముల వివరమును ౨౦-౨౧-౨౨-౨౩-అగు నీవాక్యముల యందు చూచి గ్రహించుకొనుమా॥ ౩౨॥

ఈస్వరము మనస్సుతోలయమైతే యిట్టిఫల మిచ్చు
నని జెప్పుచున్నారు.

కుడిపార్శ్వమందును ఎడమపార్శ్వమందును యొక దిక్కునుండి మఱియొకదిక్కునకు మారిమారినడిచే యీస్వరము దేహమందు లయ మునుబొంది నిలచినట్లైతే మనసుమొదలగు అంతఃకరణములు యెంత యుచలనములేక నిశ్చలతగానుండును - అప్పుడట్టివానికి యాధివ్యాధు లునశించి యేమతస్థులవల్లనైనా వానికే సంకటమున్ను లేదు - మఱియు మునివల్లనహా భయమన్నదిలేనేలేదు - పైన వివరించినప్రకారము కుడి తట్టున్ను ఎడమతట్టున్ను తిరిగిచరించుస్వరము యొక్కొకవైపున నెంత ప్రొద్దుచరించుననగా ఐదేసిగడియలు ఇందులోనున్న భూత్యములకుభా గము లెట్లు భాగింపవలయుననిన - పృధివికి ఒకటిన్నరగడియ - జలము లకు ఒక్కటింపాతికగడియ - అగ్నికి ఒక్కగడియ - వాయువునకు ము ప్పాతికగడియ - గగనమునకు అరగడియప్రకారము నిలచిపారును. ఈరీతి భూత్యములపాలుగొన్న ఐదుగడియలున్ను ఒక్కొక్కతట్టుకు న్ను సమముగా చెదరక పారవలయును. ఈక్రమమునకుతగ్గినా హెచ్చి

నా దేహమునకు పీడకలుగును - గాన యీస్వరము లయమగుమార్గ
మునుకష్టించి వెతకవలయును - అట్లు వెతకి తెలుసుకొన్నవారలకు పైన
చెప్పినఫలములు తప్పకకలుగును - మరియు నాడియొక్కటికి ఐదుగడి
యలున్న భూతత్వములప్రమాణము చెదరక నడిపించవలయును - అది
యుతప్పినా దేహమునకు పీడకలుగును - ఇదినిజము. హేశాంభవి.

తమతమ ఆయుష్కాలప్రమాణమును తెలుసుకొనుటకై
అయనసంకల్పక్రమమును తెలియజేయుచున్నారు.

స్వరమునుచూచువానికి గడచిన ఆయుర్దినములుపోగా మిగుల
వున్న ఆయువు యెంతయని దేనిచేత తెలుసుకొనవచ్చుననగా అయన
స్వరమునుచూచి తెలుసుకొనవచ్చును - దానినిచూచు విధమెట్లనగా
మాఘమాసము మొదలుకొని ఆషాఢమాసమువరకు ఆరుమాసములు
ఉత్తరాయనమనియు శ్రావణముమొదలు పుష్యమాసపర్యంతము దక్షి
ణాయనమనియును జెప్పంబడును - ఆయయనమునకు మొదటిదినము
పగటియందు వుపవాసముగానుండి ఒక్కపూట యన్నముతిని తత్వము
లను పరిశుద్ధిజేయగా దేహముచిక్కును - అందుచే మనస్సు ప్రాణవా
యువుమొదలగు యంతఃకరణములకుసహా విఘ్నములుకలుగును - వాని
నివర్తింపజేసుకొని ఆమరుసటిదినము ప్రొద్దుపుట్టనైదుగడియలుండగా
అంటె నాలుగుగంటలకుచూచ్చేటప్పు డాస్వరము తిథివారనక్షత్రములను
శ్రోత్రుదుచేసి ఎడమప్రక్కను పైవాక్యములయందు వివరించినచొప్పున
ఐదుగడియలు చెదరక సమముగాపారును - దానిని కనవలయును
శ్రావణమాసము మొదటితారీఖుననున్ను యిదేమేరకుచూడగా నప్పుడు
స్వరము కుడివైపునపారును-ఆరీతిగా పారేస్వరమున్ను ఐదుగడియలు
తప్పక సమమైపారవలసినది - అట్లుపారేస్వరమును చూచువాడగు తా
నుచేసెడు ప్రాణాయామసహాయముచేత నాదినముమొదలు యిక
ముందు నూరుసంవత్సరములవఱకును బ్రతికియుండును - ఇట్లుపారక
స్వరముతగ్గినయెడల యామైదుగడియలను నూరుపాళ్లగా భాగించి

యొక్కభాగము నొకయేడాదిగా గ్రహించుకొనవలసినది - అట్టిభాగ
ములు గడియకు యిరువదిచొప్పున ముక్కాలుగడియకు పదనేనుభాగ
ములున్ను అర్థగడియకు పదిభాగములును కాలుగడియకు ఐదుభాగ
ములవంతును స్వరముపారే ఐదుగడియలు సరిమైపారెనా నూఱుసం
వత్సరములు ఆయుస్సనియు - నాలుగుగడియపారిన యేనుబదిసంవత్స
రములనియు - మూడుగడియకు అరువదిసంవత్సరములనియు - రెండుగ
డియలకు నలువదియేడులనియు యొక్కగడియపారెనా యిరువదిసం
వత్సరములనియు నిర్ణయించుకొనవలయును - మఱియు నాయాయ
యనములయందు భ్రాంతిగా స్వరముపారక దక్షిణస్వరము వామభా
గమందున్ను - వామస్వరము దక్షిణదిశగానున్ను పారినట్టైతే వానికి
ప్పుడే మరణముకలుగునని నిశ్చయించుకొనవలసినది- హేభవానీ యిది
యతిసూక్ష్మవిద్య గనుకదీనిని యాచార్యానుగ్రహముచే గ్రహించడమే
గాక తనయిష్టదేవతా యుపాస్తియు సాత్వికభుక్తము అహింసయు
మధుపానమాంసభక్షణ- అసత్యస్వర్ణస్తేయ- ద్యూతాది మహాపా
తకీసహవాసము తుదగావర్జించి దినన్రిద్రమాని రాత్రి రెండుజాము
లకుపిదప నిద్రించుటయును నిత్యాదిసద్వ్రతముల నవలంబించియుండుట
యీస్వరకారుసిగురించి చెప్పినవిధిగాన దీనినతిశ్రద్ధా శౌచభక్తులతో
మిక్కిలి శాంతవృత్తినెఱుకగలిగి గ్రహించి యభ్యసింపవలయును॥ ౩౮॥

భోజనవిధి శరీరసుఖమునున్ను వివరించుచున్నారు.

పైవాక్యములో వివరించినరీతిని స్వరమునుచూచేవాడు సూర్యకళ
వచ్చునట్టి కళనమెత్తుకొనక ఆసూర్యకళనిమిత్త మెదురుచూచుచుండ నక్క
ఱలేదు - చంద్రుడునడచుచుండగా సహా భోజనముచేయవచ్చును -
ఎట్లనగా ఉష్ణపదార్థములున్న ఉప్పు - కారము - చేదు. అగు నీవస్తు
వులనుంచుకొని దాహము-పానముమాత్రముమాని భక్షించవలయును-
ఇందులోవివరించినరీతిని సూర్యుడునడిచెనా అప్పుడు నెయ్యి - పాలు-
పులుసు- తీపు- ఒగరుఅయిన యీవస్తువులతో భోజనమెత్తుకొని దాహ

[illegible]నమున్ను - అప్పుడే చేయవలయును - చంద్రస్వరమునకువగా తినగా[illegible] [illegible]వృలను పిదప సూర్యునియందు భోజనముచేయవచ్చును-ఇందు [illegible]విరోధముగా నాత్రము చేతగాని - ఆశవలనగాని - సూర్యునినిమిత్త [illegible]మదురొమూడక తాళితాళి చంద్రునిలోనే తింటూవచ్చినట్లాయెనా దే [illegible]పాధి అవశ్యముకలుగును - ఇట్లుతప్పగా భోజనముచేసినా నా తిండికడుపునకు సగమైయే యుండవలయును - అధికమైతే చంపును - తక్కినసగమునకు జలము కాలుభాగముగాను - వాయువు కాలుభాగ ముగా తీసుకొనుటచేత దశవాయువులనున్ను ప్రాణాయామద్వారా శుద్ధిజేసి ఏకాగ్రచిత్తుడై స్వరమునుచూడవలయును- ఇదియె యుక్తమై ననడవడి - ఇందునకై ౪-వ వాక్యభావమును జూడుము - హేపార్వతి యని మల్లీ యుంజెప్పుచున్నారు.

అన్నమధికమైననదియుదాజంపునా యన్నమంటకున్నయాత్మనొచ్చు -
చంపబెంపబువ్వచాలదాయొక్కటి విశ్వదాభిరామవినరవేమా॥ ౩౫॥

స్వరమును హెచ్చువివ్వకయు తక్కువకాకుండగానున్ను
తనవశ పరచుకొనుమార్గమును వివరించుచున్నారు.

పాలు పంచదారలవంటిరుచియు - అతిమృదువునగు మాటలుగల హేశంకరీ - ఇట్లు స్వరమునుచూచేవానికి యనుభవం ఈగ్రంథమందు చెప్పియున్న ప్రకారముగానే వచ్చునా-మఱియు నీవిధిప్రకారముతప్పక భోజనాదులున్ను క్రమముగా చేకూడునా - ఆస్వరము యెక్కువైనా లేక తక్కువైనా వ్యాధినికలుగజేసునుగదా- అట్టిది సులభమునసరిపడి వచ్చునా - రాదు. ఆరీతిరానియెడ తానెట్లు శాశ్వతసౌఖ్యమును బొం దబోవుచున్నాడు - తన్నడిగేవాలకు [illegible]ప్రకారము విధినెఱింగి శుభాశు భములను చెప్పగలడని శంకంబొందవలదు - చేత నద్దమున్నవానికి ముఖదర్శన మెట్లుసులభమో అట్లున్ను (స్వరముజూచువాడు పరమును జూడును॥ వి॥) అను శిష్టజనోక్తిప్రకారము యీస్వరమును గణించిచూ చేవానికి యెట్టికార్యమైనను తప్పిపోదు- అట్టివానిని దర్శించువారలకు సకల తలంచినవన్నియును చేకూడును - అదెట్లనగా పృథివి - అప్పు -

అగ్ని - వాయువు - ఆకాశమునగు పంచభూతమ్ములయొక్క అంశ మునుబొంది చరించుస్వరమును వృథాపోనివ్వక మానసబోధములను మిళితపరచి ఆధారములయందుండు క్రమమునెరింగి దశనాడులయం దున్న ముఖ్యమైనది ప్రాణనాడి, అందుండివెడలెడు చంద్రసూర్యవస్థా లను సీమాంటి యొక్కగుణచర్యలనున్ను చూచినట్లాయెనా కరతలామ లకమువలె సమస్తముం దెలియవచ్చును - ఇదియె మోక్షముచేరుటకు ముఖ్యమగు రాజభాటయని గ్రహింపుమా॥ ౩౬॥

స్వరమునుచూచేవాడు శుభాశుభములున్ను మరణ
సూచకమునున్ను తెలిసికొనునిమిత్తం ఛాయాపురు
ష దర్శనలక్షణము ను తెలియజేయుచున్నారు. *

ఎటులనగా.

భూమియందు మిట్టుపల్లములులేని బైలుగానుండుచోట నిలచి ఆకాశమందు మేఘావరణములులేక నిర్మలముగానుండువేళలో అమా వాస్య పగటియందును పౌర్ణమినాడు రాత్రియందును తనదేహచ్ఛా య ఐదంగుళములు మొదలు పదియదుగులకు యెక్కువగాక నుండుతరు ణమందు ఆఛాయతిన్నగా నిలువంబడి చేతులురెంటిని వ్రేలాడవిడచి గాని లేక నడుముకిరువంకలను నిలచిగాని తనఛాయను రెప్పపాటు లేక (ఓంవాశివాశి) అనుమంత్రమును మననించుకొంటూ ఫాలము - కంఠము - హృదయము - నాభిమధ్య వీట్లలోనే దేనినొకటియందు పది- పదునేను - నిమిషములవరకు చూచుచుండి అట్టె తనకెదుటి ఆకాశ మును రెప్పవేయక చూచేనా యచ్చట వీనిరూపము కనబడును - ఆరూ పము స్వర్ణఛాయగానుండెనా మిక్కిలి శుభముకలుగును - శుక్లవర్ణ మైతే ప్రాణభయములేక ఆయుర్వృద్ధియునగును - రక్తవర్ణమైతే ఆయువు క్షీణించడమేగాక ఒకవ్యాధియున్ను కలుగును - నలుపైతే దేహపీడకలుగును - మఱియు ఆరూపమందు చేతులుగాని కాళ్లుగాని కనబడకపోయినట్లాయెనా షాణ్మాసములకు మరణమనియు శిరములేక

(కబంధమై) కనబడితే మూడుమాసములకు మరణమనియును-ధ్రువులు వసిష్ఠారుంధతుల మండలములను దర్శించువారలకు మెప్పుడవి యదృశ్యములగునో ఆదినముమొదలు ఆరు-మూడు-మాసములకు మరణంబని ఊహించి సాధువులగువారలు (కాశీంతుమరణాన్ముక్తిః) యను న్యాయమునుబట్టి కాశికివెళ్లి గంగాస్నానపానమును విశ్వేశునిచే తారకబ్రహ్మోపదేశమునుబొంది ఇష్టార్థమును బొందుచున్నారని మేధావంతులు చెప్పుదురు - ఇది సత్యంబనినిశ్చయించి సద్గతికైన భక్తివైరాగ్యజ్ఞానముల యందప్రమత్తతగలిగి తనయుపాస్తిదేవతను అహర్నిశంబులును త్రికరణశుద్ధిగా తైలధారరీతిని ధ్యానించుచూ నిద్రాహారములను వర్జించి ఆధివ్యాధులకును మరణకాలమందు కనబడు మహాభయంకరమగు వాత-పిత్త-శ్లేష్మరూపులగు కాల- యమదూతలకు భయంబునొందక మిక్కిలిధీరుడై పరమాత్మనుదర్శించి యందు తాను ఘటాకాశము మహాకాశమందు కలియురీతిని ఐక్యసమాధిని బొందవలయును (భాగవతము)

మ ॥ పరుడై యీశ్వరుడై మహామహిముడై ప్రాపంచప్రభవస్థానసం।
హరణక్రీడనుడై త్రిశక్తియుతుడై యంతర్గతజ్యోతియై।
పరమేష్ఠిప్రముఖామరాధిపులకున్ బ్రాపింపగాకుండద్య।
త్పరమార్గంబున తేజరిల్లుహరికిన్ తత్త్వార్థినై మ్రొక్కెదన్॥

ఉ ॥ ఏవిభువందనార్చనము లేవిభుచింతయునామకీర్తనం।
బేవిభులీలలద్భుతము లెవ్వనిసంశ్రవణంబుసేయునో।
పావలిబాసిలోకము శుభాయతవృత్తిచెలంగుసంప్రనే।
నావిభునాశ్రయించెద నఘౌఘనివృత్తిదుభద్రకీర్తనున్॥

చ ॥ తపములుజేసినైన మతిదానములెన్నియుజేసినైననే।
జపములుజేసినైన ఫలసంచయమెవ్వనిజేర్పకున్నహో।
యుపదములైదురంత విపదంచితరీతిగనొప్పుచుండునా।
య్యపరిమితుంభజించెద నఘౌఘనివృత్తిగభద్రకీర్తనున్।

మ॥ యవనవ్యాళకపుళిందహూణశకకంకాభీరచండాలసం।
భవులుందక్కినపాపవర్తనులునే భద్రాత్ము జింతించిభా।
గవతశ్రేష్ఠులడాసిశుద్ధతనులన్ కల్యాణులై యుందురా।
యవికారుం బ్రభవిష్ణునాదుమదిలో నశ్రాంతముం బ్రొక్కెదన్॥
తపముల్ జేసిననోమనోనియతినో దానవ్రతప్రీతినో।
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినోనెట్లుల।
బ్ధపదు - డౌనః బ్రహ్మరుద్రముఖరుల్ భావింతురే వ్యాసియు।
య్యపవర్గాధిపునాత్మమూర్తిసుప్రభుం డౌగాకనాకెప్పుడున్॥

ఇందులకు నిదర్శనముగా ఖట్వాంగపరీక్షితుల భక్తివైరాగ్యజ్ఞానములను జూడుడు. * * * * * *

గీ॥ ఉత్తమశ్లోకుడననెవ్వడుస్నవాడు। సన్నుతుండగునెవ్వడుసకలదిశల। సర్వపరమేశ్వరునిచిత్తమందునిలిపి। తద్గుణంబులవర్ణింపుధరణినాథా॥

ఉ॥ ఏనుమృతుండనాదునని యెంతభయంబుమనంబులోపల।
న్మానుముసంభవంబుగల మానవకోట్లకుచావునిత్యమౌ।
గానహరిందలంపుమిక గల్గదుజన్మము నీకుధాత్రిపై।
మానవనాథబొందెడవు మాధవలోకనివాససౌఖ్యమున్॥

క॥ ఏమదినంబులమాక్తిం। గూడగనేర్చువచ్చుగుసంసార।
క్రీడనమేత్రియనెడతెగ। బోమడమాతం డ్రులారశ్రుతివచనములన్॥

క॥ గిరులంబోలెడికరులను। హరులందనప్రాణదయితలైమనిమెదుసుం।
దరులనుహితనరులనుబుధ। వరులనువర్జించిగాఢవైరాగ్యమునన్॥

ఈరీతి కడువిరక్తితో భగవద్ధ్యానము చేయుచుండవలయును-మరియును సూర్యునియందు చూచేదానికి (ఛాయాపురుషనునియు) చంద్రునియందు చూచుదానికి (మాయాపురుషమనియు) చెప్పుదురు - ఇటువంటి ఛాయాపురుషమును యెడతెగక పండ్రెండుసంవత్సరములు చూచుచువచ్చేనా ఆఛాయాపురుషము తనయెదటనిలువంబడి మాటలాడును- అందుచే తాను అష్టమహాసిద్ధులను పొందుటమాత్రమే గాదు-మరికొన్ని

దినములకు ఆఛాయయొక మనిషిస్వరూపమై తనవెంబడి తిరుగుచుండి తానుశయనించిన అవియు శయనించును - లేచినతోడనే లేచును- నడిచినవెంట నడుచును - అటవిమార్గమందు దొంగలుమొదలు క్రూరజంతువులచే బాధలుకగకుం డునట్లు తోడై కాచును - వీనికిరాగల శుభాశుభములు ముందుగానెఱింగి అశుభము కలిగేట్లాగుంటే నందుకు పరిహారమును తెలియజేయు నింకయు ననేకయద్భుతములను గలుగజేయుచుండునని మేధావులు వక్కాణింతురు హెశాంభవీ యింకయుంజెప్పెద సావధానచిత్తయై వినుమనిట్లనియె.

అష్టసిద్ధులవివరము.

అణిమ - యనగా అణుప్రమాణమైన ప్రాణులయం దణుప్రమాణమై యుండుట.

మహిమ - యనగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివ, మాయాండములకంటే పెద్దవాడౌట.

గరిమ - యనగా బ్రహ్మాండమునకంటే భారమైయుండుట.

లఘిమ - యనగా మేరువంతబరువుగలిగిన తాను దూదివలె తేలికయై యుండుట.

ప్రాప్తి - యనగా యిష్టపదార్థములలభింపజేసుకొనుట.

ప్రాకామ్యం- అనగా ఆకాశగమనాది సిద్ధులుపొందుట.

ఈశత్వము - యనగా సూర్య, చంద్ర, మహేంద్ర, ఉపేంద్ర, ప్రముఖ దేవతలను తనకార్యములకై నియమించుకొనుట.

వశిత్వము - యనగా సకలజంతువులను తనవశముజేసుకొనుట అనియెరుంగుము. ౩౭

మరణలక్షణమును ధనురాకారముయొక్క ఫలమున్ను తెలుపుచున్నారు.

ఆకాశమందు కళంకములేక సూర్యుడు ప్రకాశించుచుండగా ప్రమానినీడయందుగాని లేక యింటిద్వారపు నీడయందుగాని స్వరమును చూచేవాడు యానీడ తనయెదటనుండేటట్టు నిలచి నోటినిండుగ నీళ్లు నించుకొని యానీడసమీపమందు అణువులుగా యెగిరిపడేటట్టు ఒకపె

ష్టునయమ్మి చేసి యానీటియణువులనుచూడగా నందులో నింద్రధనుస్సు
దానియైదువన్నెలతో కనబడును - అట్లుకనబడెనా చూచువాడు తన
కొక సంవత్సరమువఱకు చావులేదని నిశ్చయించుకొనవలసినది-మఱియు
సాధనువునుచూచుచుండగా నది రెండైవిరిగిన తనకు ఆసంవత్సరములోనే
మృత్యువుకలుగుననియు నులేక అట్లువిరిగిన ఆధనుస్సువన్నెమాసి యొక
స్త్రీరూపముగా కనబడెనా ఆఱుమాసములకు యమదర్శనంబగునని దృ
ఢముగా నెఱిగికొనవలయును॥ ౩౮॥

చంద్రసూర్య బింబదర్శనలక్షణమును తెలియజేయుచున్నారు.

ఒకతామ్రపుప్రమిదెలో యావునెయ్యి కరిగించివిడిచి అందులో పౌ
ర్ణమినాడు రాత్రిచంద్రునిన్ని అమావాస్యనాడు పగలుసూర్యునిన్ని
చూచినట్టాయెనా అందులోచెను చంద్రుడు లేక సూర్యుడు తెలుపు -
ఎఱుపు - పసుపు - పచ్చ - నలుపు - నీవైదింట నేదని యొకవర్ణముదో
చును. వానియందు తెలుపైతే ప్రాణభయము లేదు. ఎఱుపైతే శుభము
గలుగును. పసుపైతే కీడు. పచ్చనైతె వ్యాధి. నలుపైతె మరణముక
లుగును. అట్లుచచ్చేవానికి కాలనిర్ణయ మెప్పుడనగా దక్షిణబింబము
తక్కువైతేనా ఒకసంవత్సరమునకు మృత్యువగునియును పశ్చిమబిం
బము తక్కువైతే ఆఱుమాసములకు ఉత్తరబింబమునకు మూడుమాస
ములకున్ను తూర్పున కొక్కమాసమునియును ఆబింబమునకుమధ్యే ద్వా
రముకనబడెనా పదిదినములకు మరణంబని యెఱుంగవలయును - హే
హిమరాజపుత్రీ వీటినన్నింటిని సాధువులనిమిత్తమై ముఖ్యముగాచేయ
బడినది. అట్టిది (పంటకై పార్చిన నీరుపక్కలనున్న గడ్డికిన్ని అనుకూలించి
నట్టు) జ్ఞానులనుబట్టి లోకులకున్ను మిక్కిలి ప్రయోజనకరమైయున్నవి-
నిర్మలచిత్తముతో గ్రహింపుమా॥ ౩౯॥

మఱియు శరీరభిన్నముమొదలగు మరణచిహ్నములను
తెలియజెప్పుచున్నారు.

చెయి-కాలు-నోసలు-చెంపలను-నిపివిడువక నదరినట్లాయెనా మర
ణకాలము సన్నిహితమైనదని యెఱుంగవలయును - ఎట్లులనగా చెయి

యుదిరేనా ఒక్క సంవత్సరమునకు మరణమనియు - కాలైతే ఆరుమాస ములు - నెత్తికి మూడుమాసములు - చెంపకు పదిదినములు మరణమని గ్రహింపుమా - మఱియు దైవికముగా చెవివినకుంటే ఒకవారమునకు మరణమనియు-దృష్టిసుందమైతే ఐదుదినములకు ముక్కు నకు గంధముతో చకుంటే మూడుదినములు నోరుతడబడి మాటలులేకుంటే రెండుదినము లకు చావు సత్యమనియెంచి నదైవంకేశవాత్పరం, శివాత్పరతరం నాస్తి, ఏకోదేవాః కేశవోవాశ్శివోవా, హరిహరరూపా, అను న్యా యముచొప్పున అంతర్యామియును - ఆత్మారాముండును - పరమాత్మ స్వరూపుండగు నన్నుగాని - నేనే తానైన శ్రీరామబ్రహ్మమునుగాని త్రికరణశుద్ధిగాను ధ్యానముచేసినట్టైతే యిట్టి పాపసంభవమగువిపత్తు లు కలుగనేరవు- ఓరిరాజా, ఎట్టిపాపమైనా నశించుననియు ఉంగుమా.

ఇందులకు దర్శకము - శ్రీసీతారామాంజనేయసంవాదము.

తే- గీ॥ రామ తారక పావన రామనామ।
మెంత పాపంబులడగించునంతయఘము।
స్వప్నమందైన నిజమైన జాలదనగ।
తప్పిభావంబునన్నంగ తరమునాకు॥

క॥ ఈ రేడుజగములందును। నారీమణిపసుల రామనామము చేతం।
జీరబడనిఘనదుర్భర। ఘోరమహాఘంబు లేదుకోరి వెదకినన్॥

తే- గీ॥ బ్రహ్మహత్యాయుతముమద్యపాన।
దశశతమునగుర్వంగనాకోటిగమనదురిత।
మపరిమిత హేమచౌర్యంబులనవరతము।
రామనామాభిధానములో రాజవదన॥

సీ॥ బ్రహ్మహత్యాఖ్యపాపతమోగ్రబింబంబు మధుపానదోషా భ్రమారుతంబు। తపసీయుచౌర్యపాతకశైలభిదురంబు గురువధూగమ నాఘకుంభిహరియు। జననీపితృభ్రాతృవసితార్చకాచార్య గోవధార ణ్యోరుదావవహ్ని। పరసతీసంగమపరధనహరణాది ఘోరపంకోరగ

వచ్చునప్పుడు పోవునని యును) వ్యత్యాసముగానడిగినా అది సరిపడదు- పోయ్యేటప్పుడు పోవునేగాని రాదు - స్వరము లోపలవచ్చేటప్పుడు వచ్చునేగాని పోదు- మరిన్ని స్వరముపోవునప్పుడు రోగము తీరునాఅంటే తీరదు- అది లోపలప్రవేశించునప్పుడు తీరును అని చక్కగా గ్రహించవలయును - హెంకాళీ, దీనిని మిక్కిలిసాత్వికులు గ్రహింతురుగాని తక్కినవారల కసాధ్యమనియూహించుమా॥ ౮౧॥

గుటిజెప్పుటకు యుద్ధముజేయుటకు ఇట్టిసమయము-
మంచిదని జెప్పుచున్నారు.

గుటియడుగవచ్చిన యొకమనిషి తనకార్యమును జెప్పుకొంచూ మొదట పూరణపక్కవచ్చి పిదప శూన్యము తట్టువచ్చి నిలిచెనా నాకార్యమనర్థమే యగును - ప్రథమతః సూర్యునిలో నిలచి యనంతరము పూరణంవైపుకు వచ్చినట్లాయెనా మధ్యమము - ఈ రెండువ్యత్యాసములున్న లేక ఆవచ్చినవాడు క్రమముగా పూరణపక్కగానే యుండి తానువచ్చిన కార్యమును చెప్పిముగించినట్లైతే యాకార్యము మేలేయగును - అనిగ్రహింపవలయును. యుద్ధలక్షణమును జెప్పవలసితే చంద్రుడునడవగా వెళ్లి సూర్యునియందు యుద్ధభూమిని నిలచినట్లాయెనా ఎంతెంతటివాడైనాసరే ఓడును - ఈప్రకారముగాయిక చంద్రునియందు కదలి చంద్రునిలోనే యుద్ధమునకు ఆరంభించినట్లాయెనా అట్టివాడు తప్పక హానిబొందును-మఱియు సూర్యస్వరములో బయలుదేరి- ఆస్వరములోనే యుద్ధమునకారంభించెనా తాను జయించుటయేకాక తనమీద యొక దెబ్బయుతగలక జయమును బొందివచ్చును - శ్లో॥ - మనోజయంతు మాండవ్యం - తనసంకల్పమే బంధము - తనసంకల్పక్షయంబె తత్వము వేమా - ఇది సత్యవచనమని యెరుంగుము॥ ౮౨॥

యుద్ధమును జయించుమార్గము మఱియొకరీతని
దెలియ జెప్పుచున్నారు.

అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఒ-ఓ-లను వీటియందు మొదటి అ-ఆలుబాలభాగమనిన్ని రెండవ ఇ-ఈలుయౌవనభాగమనియు, మూడవ ఉ-ఊలు

రాజుభాగమనియు, తక్కిన ఎ-ఏ-ఒ-ఓలు రెండును వృద్ధభాగమనియు
నుం దెలుసుకొనవలయును- వీనియందు యుద్ధముచేయువాని నామము
నకు మొదటియక్షరమును చూడగా అకారమైతే అకారముతోనున్న -
ఈకారమైతే ఈకారముతోనున్న - ఊకారముగానుంటే ఊకారము
తోనున్న - ఏకారమును ఏకారముతోనున్న - ఓకారమును ఓకారము
తోనున్నగూర్చి వాండ్లను యీయక్షరములచొప్పున బాలుడు - యౌవ
నుడు-రాజు-వృద్ధునిగానియమించుకొని బాలుడైతే యౌవనుని రాజును
వృద్ధునిజయించుననియును వృద్ధుడు తక్కినవారలచేత నోడుననియును
చెప్పవచ్చును - అందులోనున్న ఎ-ఏ-ఒ-ఓలు వృద్ధాంశములు. ఈ రెండ
క్షరములుగలవాడు తక్కినవారలచే చచ్చును-మఱియుం జెప్పెదవినుము.

గర్భచిహ్నమూయొక్క క్రమమును తెలియజెప్పుచున్నారు.

పూర్వముచెప్పిన గర్భచిహ్నము ఒకవిధము - ఇది మఱియొకవిధమని
యెరుంగుము - ఎటులనగా, రెండుస్వరములున్న నడుచుచుండగా అడి
గిన నాబిడ్డ యమడలనవచ్చును - ఏతట్టుగానుండినను పూరణకు పురుష
డనిన్ని - శూన్యమునకు స్త్రీయనియును చెప్పవచ్చునుగాని పూర్వవాక్య
ములయందు చెప్పినమేరకగునని తెలుసుకోతగ్గది - ఇదిగాక ఉదయకా
లమందు భార్యకుస్వరము యెడమతట్టునడిచి పెనిమిటికి కుడితట్టునడిచే
నా ఆసూర్యస్వరమును తనస్వరముతోతీసి తానెలోగాను అభ్యాసము
చేయుచువచ్చేనేని ఆభార్య తనవశములోనేయుండునుగాని పరులముఖ
మును చూడగోరదు - అట్లు పంద్రెండుమాలుజతీసి లోగొనవలెననియు
నుం జెప్పుదురు - మరియు వారస్వరములు యేయేభూతములలో పుట్ట
వలయునంటే బుధునికిపృధివియందున్న, ఆదివారముఅప్పునందును,
శని సోమలు అగ్నియందును, గురుమంగళవారములు వాయువునందును,
శుక్రవారము ఆకాశములోనున్న పుట్టుచుండవలయును - అట్లుపుట్టితే
ఆవారము క్రమముగానడచినదానివల్ల గలుగుశుభములకే మిక్కిలిప్ర
యోజనమును కలుగునని గ్రహించతగ్గది - మఱియు చరరాసియగుసూ
ర్యునిన్ని, స్థిరరాసియగుచంద్రునిన్ని, ఉభయరాసియగు సుషుమ్నము

నున్ను, మరి వాటియొక్క ప్రయోజన భాగములనున్ను, పద్మాసనమం దుండి నెమ్మదిగా శివయోగముచ్చేసినగాని చక్కగా గ్రహించుట యరిది. -శీవుడు వృధాపోనేరదు - జీవన్ముక్తుడగుటకు అది మార్గము - అట్లులేని యెడ వృధాబోవును - అనగా జన్మమెత్తినందుకు ప్రయోజనములేదు.

నాడికాత్రయముల క్రమమును జెప్పుచున్నారు.

హేకాత్యాయనీ నేనుజెప్పిన యీస్వరశాస్త్రమును అతిశ్రద్ధాభక్తులతో గ్రహించిచూడుమా-సూర్యచంద్రసుషుమ్నములు అను నీమూటియందును శుభము - అశుభము యధారీతియను మూడుకర్మలనిదాన ఫలములను అడిగినప్పుడు సూర్యుడైతే శుభములనున్ను - మిక్కిలియై శ్వర్యములనున్ను పొందగలరనియు - చంద్రుడైతే అశుభమాదిగన్యహీనతపొందుదురనియు సుషుమ్నయైతే పూర్వపురీతినే హెచ్చుగాక తక్కువగాక వున్నరీతినుండుననియు మరిన్ని దేవాదిదేవతలచే వశీకరింపబడువాడై నాపైనవివరించిన నాడులరీతిని జయాపజయములను బొందుననియును - చంద్రు డధికముగాచరించెనా జయమునుపొందడనియును - సూర్యు డధికముగానుండెనా జయమును బొందుననియును యెఱింగికొనవలయును॥ ౪౫॥

నాడిభేదమున కుపశాంతిమును జెప్పుచున్నారు.

ముందువివరించిన వాక్యములప్రకారము చంద్రు డధికముగానడిచెనా తనకు కీడువచ్చుటమాత్రమేకాదు - తనబంధువులకున్ను అట్లాగే సంభవించును- శత్రువులుపుట్టుదురనుట తప్పదు- చంద్రునిలోపోవలసిన కార్యముకాని కార్యార్థమైపోవుచుండగా చంద్రుడునడిచెనా ఆస్వరమునే దీర్ఘముగావెలివిడచి ఆపాదమును రెండుమూడడుగులు ముందిడుకొని పోవలయును - సూర్యునిలో పోవలసినకార్యముకాని కార్యార్థముగాపోవునప్పుడు సూర్యుడునడిచెనా అకుడిస్వరమునే లోపలతీసి ఆకుడికాలితో రెండుమూడడుగులు ముందిడుచుపోవలయును - అట్లు చేసినట్టైతే తానుపోవుకార్యము ఫలించునని యెఱుంగవలయును॥ ౪౬

చంద్రుని లో నడుచు భూతత్త్వములక్రమమును దెలియజేయుచున్నారు.

చంద్రస్వరములో పృథివికలిసినడిచెనా అట్టికాలమందు దేవాలయ ప్రాకారములు గృహములుకట్టుట, గృహప్రవేశముచేయుట, గ్రహశాంతిచేయుట, వృక్షములునాటుట, అను వీటికిమంచిది. జలమైతే తటాకప్రతిష్ఠ, నందనవనమువేయించుట, భూమిదున్నుట, విత్తనము వేయుట, వివాహముచేయుట, అను వీటికిమంచిది. అగ్నియైతే వ్యాధినివారణ చేయవచ్చును - వాయువైతేనో రథగజతురగములు, వోడలు మొదలగునవి నడుపుటకుమంచిది - మఱియును॥ ౪౭॥ ఇదియునదే.

ఆకాశమైతే మంత్రముజపించుట - ధనుర్బాణములతో యుద్ధము చేయుటకుమంచిది - ఈయాకాశాంశఫలము సూర్యునికిన్ని చెల్లును - ఇదియిట్లుండగా చంద్రునిదిక్కైనా లేక చంద్రుడైనా సూర్యుడైనాసరే వచ్చినవాడు పూరణపక్షములోనిలచినట్టైతే ఆవచ్చినవానికార్యము సఫలమగును - మఱియు దిక్కు, పురుషుడు, స్త్రీ, శూన్యము, పూరణము, అక్షరము, ఇవి మొదలగునవిచెప్పబడ్డ ఈస్వరశాస్త్రములోని సూక్ష్మ వస్తువునుయెఱిగి ఇది యిటువంటిదనియు - అది యిట్టిదనియును తీర్మానించుటకు యీశాస్త్రమును దెలిసినవాడే సృష్టివాడుగాని తక్కినవాడు మనుష్యమాత్రుడు కానేకాడు॥ ౪౮॥

ఈస్వరమును చూచేవానిమహాత్మ్యమును జెప్పుచున్నారు.

ఉత్కృష్టమగు బ్రాహ్మణకులమందుబుట్టినా లేక నికృష్టజాతియందుపుట్టినా మఱియెట్టివాడైనాసరే ఈస్వరముచేత సమస్తమును కరతలామలకముగా తెలుసుకొని కాలముతప్పక చూచిగ్రహించువాడే బ్రాహ్మణుండనందగును - మరియును అట్టివాడు యీచరాచరముల యొక్క స్వరూపస్వభావములను నెరింగినవాడై యీభూమియందు దేవుండని అందరిచేపూజింపబడి చిరకాలము బ్రతికి పరమాత్మస్వరూపమందైక్యతయును సాయుజ్యంబునుబొందును - ఈరీతి ప్రియమైన ప్రయాస లెత్తుకొని శ్రీమద్దేశికోత్తములు నాశ్రయించి వారిచేననుగ్రహింపబడకనేరనివారలు మిక్కిలి హీనస్థితిగలవారై యతిపేయమగు మలము.

లోని క్రిమికీటకాదులై పుట్టుచు గిట్టుచుందురు - ఇదిసత్యము. మఱియు మిగులహీనజాతియందు పుట్టినవాడైనను నాచేమి సద్గురుద్వారా యీ శాస్త్రమును ఉపదేశమూలకముగా గ్రహించి యీహంసగణమందు స దావర్తించువాడు యెవడైనాగాని అట్టివాడు నేనేయగుదునుమీ వానికినాకు భేదమించుకైననుండదు - అగ్నియైనది తనలోరాబడ్డ యన్ని వస్తువులను తనస్వరూపముగానే చేసుకొనునటుల నాస్వరూపమగు యీస్వరమునుచూచేవాడును నేనేయగుదును - ఎట్లనగా బ్రహ్మాది స్తంబపర్యంతమున్ను వ్యాపించి అచరాచరభూతములన్నియు నేనే యయి సర్వజీవుల హృదయకమలమునధిష్టించి హంసస్వరూపముతో రమించునట్టి నన్నుజూచి నాయందులీనమగువాడు నేనేకానివేఱుకాడు- మఱియు సముద్రజలమువంటి నాయందు (అలలు-తుంపరలు-నురుగులు-బుగ్గలరీతి) యీచరాచర రూపప్రపంచము కలిగితోచి నాయందే లీన మగునటుల యోచించిచూడుమా - హెడుమాడ్జవీ అట్టివాడు ఉత్తదే పుట్టుచు చచ్చుచునుండడు - ఇంతకంటే ఈస్వరమును చూచువానినిగు రించి విశేషముగా చెప్పవలసితే నాయొక్కజటాభారమందు ధరింపబ డియుండు చంద్రరేఖవలె నాశిరముమీద శాశ్వతుడై వాసనతోగూడిన స్వర్ణపుష్పముగా నుండును. ఇది సత్యం, సత్యం, పునస్సత్యంబని యానతిచ్చి మఱియునిట్లనియె.

ఈశ్వరవాక్యమునకు సమ్మతిగా శిష్టజనవచనములు.

శ్లో. ౧ జన్మనాజాయతేశూద్రః కర్మణాజాయతేర్ద్విజః।
వేదపాఠంతువిప్రాణాం బ్రహ్మజ్ఞానంతుబ్రాహ్మణః॥

౨ దాసీగర్భసంభూతం నారదస్యమహామునిః।
తపసాబ్రాహ్మణోభూత్వా తస్యజాతంనకారయేత్॥

౩ ఊర్వసీగర్భసంభూతం వసిష్టస్యమహామునిః।
తపసాబ్రాహ్మణోభూత్వా తస్యజాతంనకారయేత్॥

౪ శునకీగర్భసంభూతం శౌనకస్యమహామునిః।
తపసాబ్రాహ్మణోభూత్వా తస్యజాతంనకారయేత్॥

గీ॥ రామనామపఠనశ్లోమహిమవాల్మికి । పరగబోయయయ్యెబాపడయ్యె । తపముచేతద్విజుడుతలిరంపకులమెట్లు ॥ విశ్వ ॥ తనదుతల్లిలంజతనయాలుమాదిగ । శ్రీపతికిగురువువసిష్టుడరయ । కులముకన్న నెంచ గుణమెప్రధానము ॥ విశ్వ ॥

మఱియును స్పర్శలేది. పద్మములు- రత్నములు-స్వర్ణము- మౌక్తికములు- చామరలు- గోరోచనము- క్షీరము- పుష్పములు- తేనె- పట్టు- పునుగు- జవ్వాది- అగ్ని మొదలగువస్తువుల ఉత్పత్తికారణములు ప్రయోజనపూజ్యతలనుగురించి యోచించిచూడగా గుణమేముఖ్యముగా కనబడుచున్నదిగాని ఉత్పత్తిస్థానములను లెక్కింప నక్కరలేనట్లు ఈస్వరము నుచూచి సాధించినవానినిసహా శ్రేష్ఠుడనియును అందరిచేపూజ్యుడనియు నెంచవలయును - గాని వానియొక్క కులగోత్రనామముల నెంచుట యు నావశ్యకమని యెఱుంగతగ్గది.

గీ॥ బ్రాహ్మణులమటంచుకొందరుబలుకుబెట్లు। బ్రహ్మ మెఱుగంగ నేరకబ్రాహ్మడగునె। బ్రహ్మ మెరిగినవాడెపోబ్రాహ్మణుండు॥ నవ్యతర॥ అజ్ఞానమెశూద్రత్వము। సుజ్ఞానముబ్రహ్మమౌటశ్రుతులనువినరా। అజ్ఞానముడిగివాల్మికి। సుజ్ఞానపుబ్రహ్మ నొందెజూడరవేమా ॥ జాతులందునెట్టిజాతిముఖ్యముజూడ । నెరుకలేకతిరుగనేమిగలదు । యెరుకగలుగుమనుజుడేజాతిగలవాడు॥ విశ్వ॥ కడుపులోనిరోతకడునోటిమెంగిలి । కడుగవశమెబ్రహ్మకొడుకుకైన । సత్యమున్నకొంతజగతిపైసిద్ధించు॥ విశ్వ॥

ఈస్వరశాస్త్రము నభ్యసించువారలు నడచుకొనవలసిన
దినచర్యాక్రమములను అగస్త్యాది మహాసిద్ధుల
సమ్మతంబుగని రూపించుచున్నారు.

సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని పాదారవిందములయందుచిత్తంబుజేర్చి తైలధారరీతిగా ననిశమును నిశ్చలతతో ధ్యానించుచు, సాధుసంగంబును- శాంతవృత్తియును - శాస్త్రచింతనంబును- సదానందంబుతోగూడి (జలగనుసుకాచిత్రాగుచు) జిలకొట్టినమజ్జిగయు - కరిగిం

చిన నెయ్యితో భోజనముచేయుచూ - రాత్రులయందు పాలేగాని పెరు
గుముట్టక - తైలమురుద్దుకొనిన వేడినీళ్లస్నానమును - పగటికాలమందు
నిద్ర - స్త్రీసంగమము చేయక - తనకంటే హెచ్చువయస్సుగల స్త్రీలతో
భోగించకయు లేతమెండ కోరకయు - రెంటినణచక (అనగా మలజల
విసర్జనములనణచక, అవిచేయునపుడు మృత్తికచేతను జలముచేతను
శుద్ధిజేసుకొనుట బాహ్యపరిశుద్ధియనంబడును) రాగ - ద్వేష - కామ -
క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్య - ఈర్ష్య - అసూయ -
దంభ - దర్ప - అహంకారాది దశేంద్రియాంతఃకరణములను, ఆణవ -
కార్మిక - మాయిక - మాయేయి - తిరోధానాది పంచమలములనుకూ
డక నిశ్చలుడై ఆత్మారాముని నిశ్చలతతోనుపాసించుట అంతరపరిశుద్ధి
యనంబడును - ఇందులకుకారణము అన్యథా కీయనగ్రహింపుము -
ఒకటిఃధికముగా వ్రయపరచక ఎడమప్రక్కనిద్రించుచు మూలరోగా
స్పదమగు శాకములదినక - పగటియందు పుల్లనిపెరుగునుభక్షించుచు -
అమృతసమానమైనా పాసినకూరదినకయు - ఎంతలాభమొచ్చినా ఆక
లిలేనిదే అన్నముముట్టక - దినము రెండుమార్లకంటే అధికముగాభో
జనమెత్తుకొనకయు - భోజనానంతము స్నానముచేయక భోజనానం
తరము కొంతనడుచుటయు - ఎంతదాహమైనా భోజనముచేసిగాని నీళ్లు
త్రాగక - తనకులస్త్రీయైనా మాసమున రెండుమార్లకంటే రతి సంగ
మముచేయక - మహాపర్వములనగా ఉత్తరదక్షిణాయనములు - తక్కిన
సంక్రమణములు అమావాస్య - పౌర్ణమి - ఏకాదశి - శివరాత్రి - కృష్ణ
పక్షాష్టమి - ఆచతుర్దశి వీట్లయందు స్వపత్నీసంగముసహా మానుకొ
నవలయును - పరదారలయందు స్వప్నేనా దృష్టిగాని - చిత్తముగాని
పోనివ్వక - అట్లుచపలించినా తత్క్షణము పాపనామార్తినిస్మరించి తద్దో
షమునుదీర్చుకొనుచు కందగడ్డతప్ప తక్కినదుంపలనుదినక అనటిపిండెలు
వినా ఆపండ్లనుభక్షించక ఎప్పుడైనాసరే కసిద్ధమునుభక్షించుచు - పా
న్యాసములకు వమనౌషధమును - ధాతుమాంద్యమునకు విరోచనౌషధ
మును - పత్రత్రయమునకు ఆఘ్రాణసశ్యమును - వారమునకొకతూరి

చౌళమును - వారమునకిరుమారులు అభ్యంగనమును - దినత్రయమునకొకపరి నేత్రాంజనమును- కస్తూరి, పునుగత్తరు, పుష్పచందనములు సభగాత్రములయం దాఘ్రాణించకయు. దూరస్త్రీలు, మేషములు - గార్ధభములు - చీపురులు - వీటి ధూళిపైబడనివ్వక ఇతరులుధరించిన వస్త్రాదులనుధరించక - దీపము, మనిషి, చెట్టు, వీట్లనీడలయందు రాత్రిళ్లునిలువక భోజన జీర్ణకాలమందు రతిసల్పక - సంధ్యాకాలమందు భోజనము - నిద్ర - మలజలాదులు - స్త్రీసంగమములను చేయక, దూడతో గూడిన ధేనువులు - దేవతలు - పితృదేవతలు - ఆచార్యులుఅయిన వీరల నారాధించుకొనుచు - నఖశిఖజలాదులపై బడనివ్వక - ఇంక తక్కిన యిట్టిసదాచారపరులగు వారలనుసమీపింప జముండుశంకించును ఇంతియెకాదు - ఇట్టి నియమవంతులపేరు వాడినవారలకున్ను రోగములంటవని పెద్దలందురు - విధివశాత్తుగా నిన్నియు నొనగూడకున్నా కలకొద్దిలో క్రమముతప్పక అనుసరించినమిగుల క్షేమకరమని గ్రహించుమాయని శ్రీశంకరుండు శ్రీశంకరిదేవికి ప్రేమాతిశయంబున నుపదేశించిన హంసస్వర కైవల్యచింతామణి సంపూర్ణము.



గీ॥ ప్రాణనాయకిదీనికి పట్టుగాను।
సభ్యసించినజనులకలభ్యమేది।
గానస్వరమునుదప్పక కాలమెఱిగి।
జూడమోక్షంబుతమకుచేగూడుజూడు॥

స్వరమేమనస్సగనుక అందునుగురించి సాధుజనోక్తి ఉదాహరణము.

మనసునిలుపంగనిలుచునుమారుతంబు।
చూపునిలుపంగనిలుపంగసుఖమునిలచు।
సరిమనోదృష్టినిలచినదొరకుముక్తి॥ నవ్యతరభోగి॥
మరియుసర్వేంద్రియములకుమనసురాజు।
మనసునకురాజుదెలుపంగమారుతంబు।
మనసుమారుతమొకటైనములయుసుఖము॥ నవ్య॥

క॥ ఏవంకమనసుగలిగిన। నావంకకునింద్రియంబులన్నియునేగు। న్నీవంకమనసుగలిగిన। నేవంకకునింద్రియంబులేగవువేమా॥ కనుజెదరమనసుజెదరుం। కనుజెదరినసుఖముజెదరుగాలియుజెదరున్। కనుజెదరకతనుగనవలె। సనకాదిమునిప్రసన్నసంపగిమన్నా॥ మనసేజీవుండనగను। మనసేతనచేష్టలుడుగమరిబ్రహ్మమగున్। మనసుగలవాడెముక్తుడు। సనకాదిమునిప్రసన్నసంపగిమన్నా॥ శివునిమీదమనసుస్థిరముగానుంచిన। యానదానుమోక్షమరయనౌను। శివునిమీదమనసుచీనుంతతప్పిన। కాదుకాదుముక్తికాదువేమా॥

కీర్తన॥ సంసారైనావొకటే సంసారమురోసినయొకటే-
హంసనటించేవిధమెరిగుంటే సంశయములువర్జించుంటే॥సం॥

సీతారామాంజనేయసంవాదము.

క॥ ప్రతనుప్రాణమనోగ్ర। స్థితబుద్ధియెబిందువందుచెలగెడియాత్మ। ప్రతిబింబమెకళపవనో। న్నతఘోషమెప్రణవనాదమువత్సా॥

గీ॥ సూక్ష్మరూపమెరిగిసుఖమొందగాలేక। బహుళముగనుజదువుబడుచునరుడు। చావుచేటెరుగనిచదువేలచదవడో॥ విశ్వదాభిరామవినవేమ॥ బ్రహ్మఘటముమేనప్రాణమన్నదిగాలి। మిత్రచంద్రవహ్నినేత్రచయము। ఇంతకన్నబ్రహ్మమెక్కడనున్నది॥ విశ్వ॥ వాయువందుబుట్టివాయువందేపెరిగి। వాయువందుమేలువరుసదెలియ। వాయువందెప్రాణవాయువుతత్వంబు॥ విశ్వ॥ అణువులోననుండునఖిలజగంబులు। అణువుతనదులోననణగియుండు। మనసునిల్పువాడుమరిముక్తిజేరురా॥ విశ్వ॥ సూచికాగ్రదృష్టిసారదిభ్రూమధ్యంబు। చూచిచూచిమరియుచూచెనేని। ఆత్మరాకపోకలప్పుడేతెలుసురా॥ విశ్వ॥ మనసుముక్తియనుచుమదినెరుంగగలేరు। మనసుచేతదగిలిమాయమైరి। మనసుతానుమైనమర్మజ్ఞుడగుయోగి॥ విశ్వదాభిరామవినరవేమా॥

శ్రీసీతారామ తారకబ్రహ్మణేనమః।

శ్రీమత్సచ్చిదానందగురుపరబ్రహ్మణేనమః।

శ్రీరామజయం.